# పండితాభిప్రాయములు.

---

మహామహోపాధ్యాయ, శతావధాని
శ్రీ వాశి కృష్ణాచార్యులవారు
గుంటూరు.

శ్రీలక్ష్మీ హయగ్రీవోవిజయతేతరాం

ఈ **మురళీధరవిలాసమను**, కల్పితకథాప్రబంధము నిండు మింపుగ నామూలాగ్రము వింటిననియే చెప్పనగు. దీర్ఘసంస్కృతసమాసఘటాయుక్తములయ్యును, శ్రవణమాత్రముననే, బహిరంతః స్ఫురత్ప్రసాదవిశదములై యొప్పు, నీపద్యములెంతయు. మనోహరములై యొప్పుచున్నయవి. జాతిపూలమాలికలఁ బోలిన యగుటంజేసి, యాపద్యములు భక్తిశృంగారరసములతోనిండి శ్రీజయదేవుని పద్యముల ననుకరించుచున్నయవి. ఏతద్గ్రంథకర్త వయసునఁ జిన్నవారైనను. వివేకఁగావలసిన యూహాపోహలలో గడుంగడు పెద్దయని నానిశ్చయము. ఇట్టి కల్పితప్రబంధములుమాత్రమే, కవులయొక్క సహజప్రతిభను జాటును. ఈబాలకవి యింకనిట్టి ప్రబంధములు రచించి యాబాలగోపాలము సద్ధరించుగాత యని నాయాశీస్సు.

---

"కింకవీంద్ర ఘటాపంచాననేత్యాది బిరుద భూషణ, కలాప్రపూర్ణ"

"శతావధాని" శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

(తిరుపతి వేంకట కవులు)

కడియం, తూ॥ గో॥ జిల్లా.

"మురళీధర విలాసము" అను సత్కావ్యము, కేవలము కల్పితమైన కథా వస్తువుగలది. దీని ధారాశుద్ధి సర్వథా ప్రాచీనమహాకవులు నన్నయాదులధారతో సమముగాఁ గలదని వ్రాయుటలో దోసము లేదు సత్యమై యుండును. ఈకాలమునందీనాడు పూర్వులవలె నట్టి ధారాశుద్ధిగల కవులు కడుంగడు మృగ్యులుగా నేయుందురు. ఈ కవివతంసుని పేరు గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు హయగ్రీవోపాసకులు ఈయన కవితాధారను బాగుగా గుర్తింపఁ గల్గిన కవులు.

శ్లో॥ "దేవీంవాచ ముపాసతేహి బహవస్సారంతు సారస్వతం
జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః॥

అనెడు శ్లోకార్థమును స్మరించి తీరుదురని నాపూర్ణ విశ్వాసము. అఖండయతులు కొన్ని వీరి కవనమందు లాక్షణికుల సమ్మతి కన్నఁ గొంత యధిక స్వాతంత్ర్యమును వహించినట్లు తెల్పెదని. అది కవియెఱిఁగి ప్రయోగించినవే యగుటచేఁ బ్రమాదపతితములను కొనరాదు. సర్వథా ఇమ్మహాకవి కవనము పండితకవీంద్రస్తోత్ర పాత్రమని నాయభిప్రాయము. భగవంతుఁ డీయనకు నిరామయాయురైశ్వర్యముల నొసంగుగాక యని యాశీర్వదించుచున్నాను.

శ్రీమాన్ ఉ॥ వే॥
శ్రీ మదర్ధంకి తిరుమలసముద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార
తిరు వేంగడ తాత దేశికాచార్యస్వామివారు
తెక్కెళ్ళపాడు—అగ్రహారము.

శ్లో॥ రామానుజస్య మురళీనినదామృతౌఘం
ఘూమో నిపీయ వినివృత్తమహాశనాయాః।
స్తబ్ధా అపి క్షణమమందమిమాశ్చర్యస్త్రై
గావోవహన్తి పరమంహిరసంస్వతోత్ర॥
శ్లో॥ ముగ్ధా అపి స్వతఉమూఢవిదగ్ధభావా
రక్తా అపి ప్రవిమలాస్సతతం ప్రకృత్యా।
రామానుజాహ్వయ కవేర్హి గిరోస్య పుంసాం
వేషాంప్రియా ఇవ హరంతి సమానసాని॥
శ్లో॥ ఇత్థం వినివేదయితా
గుదిమెళ్ళ రమానుజోక్తి హృతచేతాః।
శ్రీ శైలవంశ జన్మా
వేంకట తాత దేశికార్యోయం॥

---

మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిసార్వభౌమ
శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు
రాజమహేంద్రవరము.

గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాకు జెందిన ముత్తుపల్లి అగ్రహారమున నివసించియుండు శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజా

చార్యులుగారు రచించిన "మురళీధరవిలాస" మను పద్య ప్రబంధము కవిగారు వచ్చి చదివి నాకు వినిపించినారు. గ్రంథమంతయు వినకున్నను స్థాలీపులాకన్యాయముగ దిద్రిచినయంతయు నెఱింగితి. ఆచార్యులుగారు, సంస్కృతాంధ్రములయందు, నిరుపమాన పాండిత్యముగలిగి యీగ్రంథము రచించియున్నవారు. ఇది కల్పిత గ్రంథము. ఇందు బెద్దపెద్ద సంస్కృత సమాసములు విస్తరించి యున్నవి. అవి సుసాధుపదసంకలితములు గాన మనోహరముగానే యున్నవి. ఇది ధారాశుద్ధి గలిగి, శయ్యాపాకవృత్త్యాద్యుత్తమగుణంబులలో నొప్పుచున్నయది. వీరిగ్రంథమందు నవిత్రయము వారంగీకరింపనివియు నిప్పటి మహాకవిపృష్ఠ లంగీకరించి వాడుచున్నవి యగు కొన్ని ప్రయోగములుచేసి యున్నారు. అవి సర్వసమ్మతములై విరాజిల్లుంగాక! ఉభయ భాషాభూషణులగు నిక్కవిగారు సహజ మాధుర్య రమామాధుర్యమగు నిజకవితాశైలితో నిట్లనేక గ్రంథములు రచించి ఆంధ్రభారతి నలంకరింతురుగాక యనియు వారికి బరమేశ్వరుడు దాయురారోగ్యము లొసంగుగాక యనియు గోరుచున్నాను.

---

శ్రీమతే రామానుజాయనమః

"తర్కశిరోమణి"

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారు

హిందూ క్రైస్తవ కళాశాలా పండితులు గుంటూరు.

మురళీధర విలాసమును రచించిన కవి నాకు చిరకాలమునుండియు బరిచితుడగు బంధుప్రవరుడు. వీరిని కవిత్వమునుగూర్చి బాల్యమాదిగ మధురకవితావిహారులగు "శతావధాని" శ్రీ చెళ్ళ

పిళ్ళ వేంకటశాస్త్రిగారు స్వయముగా చేసిన ప్రశంసను నేను చూచి తిని. వారనుడివినది సర్వథా; సత్యము. వారుట్టంకించిన ధారాళ ధ్వని గురించి వారికన్నఁ బూర్వమే ఈ కవి గ్రంథములలో దేనినో నేనుగ్గడించుచూ నిరూపించి యుంటిని. ఆనాటికన్న ఈనాడు ఈ కని కవితాస్రవంతి మాధుర్యమునందును ధారయందును గూడ నభి వృద్ధినొంది యౌవన మలంకరించుచున్నది. పదవిన్యాసమునందును శ్లేషౌచిత్యాదులయందునుగూడ నింక నొక్కింత స్ఫురితమగునేని ఈతని కవిత సర్వతోముఖముగా వృద్ధమై గడుసుమీరి ప్రౌఢ వాగ లదు. నన్నయాదుల కవితామార్గమందుండదగినదనుట సర్వవిధ ముల సత్యమని ప్రమాణీత మొనర్చుచున్నాను. ఈ కవి కింకను భావనాది సామర్థ్యమును సమకూర్చి సర్వేశ్వరుఁడు తన చరిత్రము ను లోకులకు కర్ణపేయముగా నొనర్చునుగాక యని ఆశాసించు చున్నాను.



నమ శ్శ్రీ రంగ నా థా య

న్యాయభాస్కర

శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమల వేంకటరంగాచార్యులవారు

చినశ్రీరంగపురం - అగ్రహారము.

చ॥ "కవనవిశారదుం"డని ప్రకాస్తి వహించిన "రామసూరి" ప్రా
భవమున నూత్నపద్ధతిని భవ్యగతి ప్రచియించినట్టి యీ
భవభయతారకంబగు ప్రబంధమదెంతయొ కావ్యలక్ష్మితో
హవణిని లబ్ధవర్ణుల నహో యనిపించును సర్వరీతులన్.

గీ॥ కృష్ణవేణీ తటీసన్నికృష్టమగుచు
వరగలించెడు శ్రీరంగపుర విహారి
నాయుదైవము శ్రీరంగనాయకుండు
ప్రేమము పొంగి కవిని రక్షించుగాక.

ఉ॥ వేంకటరంగ దేశిక కవిజ్ఞ శిఖామణి నైజధీసము
ట్టంకిత విశ్వవిశ్వనుడితాతలనాథ సభాప్రతిష్ఠితుం
డెంచి విచిత్రగద్యపదవల్లి పథానమరంభరుంటు ని
శ్శంకుడు మాధవాంఘ్రి జలజభ్రమరుం డిటు ప్రస్తుతించెడున్



అభినవ సరస్వతీ పత్రికా సంపాదకులగు

అ ష్టా వ ధా ని

శ్రీ జా స్తి పా టి ప ట్టా భి రా మ శా స్త్రు గా రు

జా స పా టు'.

"మురళీధర విలాసము"

ఈ గ్రంథమొక కల్పిత కథ. కాని కల్పన బహుమనోహరము, భక్తిరసము ప్రవహించుచున్నది. భక్తిరసముతోపాటు శృంగారరసమును పొంగిపొరలెడిని. ప్రతిపద్యమనోహరము. ఆపద్యములావిష్కృతసంస్కృతాంధ్ర పాండిత్యములు. దీర్ఘ సంస్కృత సమాసఘటాయిష్టములు, సమాసములు, దీర్ఘములయ్యును, సత్కృత్వత

సమాత్రజ్ఞేయ సర్వార్థములు సహకార ఫలభక్షణమునం బోలె సమ్యగానందజనకములు. పేయేల? ఈగ్రంథ మొకసారి చదివిన పాఠకులెన్నాళ్ళకును విడువక ముహుర్ముహుః పఠనమున బహుశ్రద్ధ వహింతురనుట స్వభావోక్తి. అట్టి శ్రద్ధ వహింపఁజేయుటకు గ్రంథకర్త ప్రకృతకావ్యమున పోకడలుగాదె హేతువు? ప్రాచీనపుపోఁకచే. పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయము నీగ్రంథము జ్ఞాపకముచేయుచుండునని నాయభిప్రాయము. కవి రేపల్లె తాలూకాలోని ముత్రపల్లి-అగ్రహారవాస్తవ్యులు శ్రీవైష్ణవులు గుడిమెళ్ళ రామానుజాచార్యులుగారు వీరివయస్సు 25సం॥లు ఇంతలేఁ బ్రాయమున వీరి చిత్రగ్రంథరచనా సామర్థ్యము దయచేసిన హయగ్రీవదేవుఁ డభినంద్యుఁడు.

నమశ్శ్రీరామానుజమునయే.

సహాధ్యాయి

శ్రీ సముద్రాల రామానుజాచార్యులు

ముక్తిపల్లి-అగ్రహారము.

శ్లో॥ ఓం రత్నద్బ్రహ్మ శబ్ద ప్రథితముపనిషద్గీత రూపస్వరూపం
షాడ్గుణ్యోపేతమీశం ప్రకృతి పురుషయోశ్శుద్ధ సత్త్వైకతానం
విశ్వోపాదానమప్రాకృత గుణవికృతి వ్యాపి నారాయణాఖ్యం
శ్రీమద్వ్యద్వేంకటేశాకృతి జయతిమహః పాతురామానుజార్యం.

శ్లో॥ రామానుజార్య ! కవిపర్య ! భవత్ప్రణీతం
సౌధద్రపస్మయహరం కవిలోక హృద్యం
సత్కావ్యలక్షణయుతంచ తదీయ సేవా
పారిశస్త్య బోధక మపశ్య మహం ప్రబంధం.

శ్లో॥ రసభావ గుణాలంకారార్థ శబ్దాదిసౌష్టవే
మురళీధృత్ప్రబంధేఽస్మిన్న ప్రతిద్వంద్వమస్త్యలం

శ్లో॥ శ్రీమానితివ్యాననోదేవః । దిశతాత్తే సుహృన్మణే
నూత్నప్రబంధనిర్మాణ । ధౌరంధర్య మితోఽధికం॥





## శ్రీ హయగ్రీవ స్సహాయః

శ్లో॥ శ్రీమా౯ జయతు కృష్ణాత్మా
సర్వదా సముపాసితః
తాదృగశ్వాననో దేవః
యస్య హేషామయీ త్రయీ॥

శ్లో॥ జయతు శరణభాజాం దివ్య కారుణ్యమయ్యాః
భవమరుగతిఖేదం ఛాయయా నోదమానః
కరచరణకిసాలః బాహుశాఖా విశాలః
ఫణిగిరి భవపాలః కో ఽ పి ముగ్ధ స్తమాలః॥

దం॥ శ్రీరమణీయహార! ముని చిత్తవిహార! మయూరపింఛచో
డీర! సురాసురేంద్రముకుటీతటదీప్రపదాంబుజ ప్రభా
హార! సుమేరుధీర! శ్రిత పాప ధరాభ్రశతార! భక్తమం
దార! పరావతార! విబుధద్విటరాజకుఠార! గోపికా
జార! యదుప్రవీర! విలసత్కరుణామృతవృష్టిసించితా
గార! శ్రుతి స్ఫురన్మకరకుండలహార! సహస్ర మన్మథా
కార! వ్రజాంగనాసముదితప్రమితాంశుకచోర! శ్రీమనో

దారమణీకుమార! నిహతస్మయకాళియభోగిభోగసం
చార! శరన్నిశాసమయసాంద్రతుషారమయూఖచంద్రికా
సారజడీకృతప్రకృతిశాద్వలసైకతలబ్ధరాసశృం
గార! కళిందజా కృతవగాహవిధాచ్యుతవత్సచిహ్నితా
భీరవధూకుచాగ్రసురభిస్ఫుటకౌంకుమపత్రభంగసం
హార! భవాంధకార వినివారణసూర! సమస్తసద్గుణా
ధార! విలాస భావ దయితాకర కీలిత కర్ణపూర! సం
శీరవమాధురీపరవశీకృతగోపకిశోర! సాంధ్య వే
ళార భసప్రధావనఘలంఘలరావసుపర్ణ కింకిణీ
చారు సుకంఠ ధేనుఖురసంకులధూతరజోవిశేషరే
ఖారుచి చిత్రఫాలఫలకచ్యుతకుంతలభార! ద్రౌపదీ
ఘోరవిపన్నివార! నవగోపవధూమధురాధరామృతా
హార! గభీరసార! సమరాంగణ శూర! ఫలాసుమేయ సం
స్కార! గళోల్లసత్తులసికాదళదామనిగూఢపౌష్పమా
లా రమణీయసౌరభమిళన్మకరందరసాతిలోభమి
ళ్ళార సమాగమభ్రమరపంక్తిచలద్వనమాలికాప్రథా
పూరిత కౌస్తుభాభరణముగ్ధభుజాంతరసక్తసత్యభా
మారమణీమణీహృదయమార! రతాంతనితాంతతాంచిరా
ధారతి కృత్సమీక్షణసుధారససించితతార! మిత్రవిం
దారచితోపహార! సురదాపరిరంభణవైఖరీమహో
దార! వినిర్భ భూపతి సుతాకలిత ప్రపదోపచార! భ
ద్రారచనస్ఫుదామృతసురారిసహాసవిశేష విస్మృతా

స్ఫారరతిసార! మందహాసనావృతజాంబవతీసతీసమ
సత్కార! నిషేవితద్యుమణిజాఝురశీతలతీర! లక్షణా
దార! శ్రుతిప్రచార! నిహతప్రియపార్థవిచార! కంసచా
ణూరకృతాపహార! సుమనోజనసంకలితోపహార! కు
ఙ్కారచితాంగరాగపరివర్ధితకామవికార! రత్నకే
యూర! కుచేల సంస్కృతి మహోత్సవకార!నమోనమోఽస్తుతే॥

ఉ॥ పావన చంద్రమండల విభాస్వరుఁ డస్మదుపాస్యతౌరంగ
గ్రిపుఁడు నిర్మలస్ఫటికశ్రీ సమదేహుఁడు దివ్య సర్వవి
ద్యా విషయార్థదానవిధదక్షదయామృతవాహినీపరి
ప్లావితదృష్టి నన్ను సఫలశ్రము జేయక యుండ జాలునే

ఉ॥ అక్షయశేముషీగరిమసంది; ప్రపన్నులకెల్ల శ్రీ మద
ష్టాక్షరిమంత్రము న్గురుని యాజ్ఞ నతిక్రమణంబు జేసి యా
రాక్షసశిక్షకుండయిన రంగని గోపుర మెక్కి చాటు న
ప్రక్షణదక్షుఁడైన యతిరాజును గొల్తు సదా ముదంబునన్॥

సీ॥ శ్రీ మదుభయవేద శీర్ష చింతాసము
న్నతపారమార్థికజ్ఞానభరుఁడు
వరపీఠికాపురీ ప్రభు శిరః కోటీర
పీడితపాదాబ్జపీఠియుండు
షట్శాస్త్రవైదుషీ స్తవనీయశేముషీ
ప్రౌఢినిర్జితప్రతివాదిబుధుఁడు

## తిరుమల గుదిమెళ్ళ విప్ర వంశాబ్ధి
## కార్తికమాసరాకావిధుండు

గీ॥ శ్రీమదాచార్య పురుషవిశేషవిధృత
బ్రహ్మరథమహాందోళికావ్యదండు
డైన వేంకట రంగార్యుండస్మదీయ
గురుపితామహుండబ్ధిజాపరుని కరుణ
నాయు రారోగ్య వృద్ధిచే నలరుగాత॥

గీ॥ ఉభయ భాషల మాధుర్య ముట్టిపడగ
చెప్పిన మల్లెడు ప్రాచీన కవులకేను
ప్రణతు లొనరించి హాయముఖో పాసనా ప్ర
భావమున నాకన్న సుకృతి వ్రాయుచుంటి॥







# మురళీధరవిలాసము.

## ప్రథమోల్లాసము.

## శ్రీ కృతిపతిప్రస్తావన.

లసమానవైష్ణవవరేణ్యాగముక్తి పురాగ్రహారదే
వాలయమందు భూమి తనయాసహజన్ములు గొల్పంస్త్రి
శ్రీల[illegible]కరాజ్ఞుడైన రఘుసింహుఁడు "శ్రీకలగొట్లవంశము౯"
బాలనఁజేయుఁగాక కరుణాపరిణాలయుఁడౌట నెప్పుడు౯॥

సీ॥ ప్రాణుల సృష్టించు పంకేజ సంభవుం
డాయుష్యమిచ్చి నిస్తురయుఁగాక
శ్రుతిశిరశ్శ్లాఘ్యుడౌ సూర్యనారాయణుం

దారోగ్యమిచ్చి విన్నరయుఁగాత
ఘనదయాకలితయౌ ధనలక్ష్మి గజతురగై
గైశ్వర్యమిచ్చి విన్నరయుఁగాత
ప్రార్థనాహృష్టయౌ భారతీసతి విద్య
లన్నింటి నిచ్చినిన్నరయుఁగాత
గీ॥ మీకుఁ గులదైవమై మిమ్ము సాకుచుండు
నేడు కొండల శ్రీ వేంకటేశ్వరుండు
పరమకరుణను నిన్ను గాపాడుఁగాత
సరసులకు వేల్పు గిడ్డి! శ్రీ నరిసిరెడ్డి!॥
సీ॥ ఆంధ్రవాల్మీకివిఖ్యాతిమద్వాసుదా
సాంతరంగికశిష్యులై నవారు
భూదేవతాపదాంభోరుహసందర్శి
తావ్యాజకైంకర్యులై నవారు
సకలదివ్యక్షేత్రసందర్శనోద్భవ
జ్ఞాన విస్ఫాఫలులై నవారు
ఆరామదేవాలయాదిసంస్థాపన
హర్షభావోద్రేకులై నవారు
గీ॥ సత్యసంగర వ్రతమును జరుపువారు
స్వాకకులోచితధర్మాప్తి వరలువారు
గలరౌ! యెద్దాప నట్టి చాగంటివారి
పాలెమను పేరఁ గలదొక పల్లెటూరు॥

సీ॥ కోదండరాముని కోవెల గట్టించె
నెవ్వాఁడు నిర్మలాహీన భక్తి
"నానందదాసనామాంకచారిత్రము"
ప్రచియించె నెవ్వాఁడు రమ్యశైలి
శ్రీమదేకశిలాపురీ రఘూత్తమ ముద్ర
ధరియించె నెవ్వాఁడు తనయురమున
తీర్థయాత్రాస్థలీ దేవతామణులను
సేవించె నెవ్వాఁడు చిత్తమలర
గీ॥ ఆ "మహానందిరెడ్డి" సౌమ్య స్వభావుఁ
డమలమారూరివంశదుగ్ధాబ్ధివిధుఁడు
గుణముచే నాతఁడీ ధరఁ గోటి సేయు
నట్టి ధర్మైక పరులచే నలరియుండు
శ్రీలచాగంటివారిపాలెంబనంగ॥ 4

ఉ॥ ఆపురి కొక్క నాఁడు సరియైనదినంబదిజ్ఞప్తిలేదు గా
నీ; "పదునార్వతేదియు జనేవరు" మాసమయేమొ? గ్రంథ ము
ద్రాపరతన్ గమించి; ప్రమదంబున! జూచితి నూతిలోన సీ
తాపతి దేవళంబుకడ దాసజనావను నెన్నుగొందఱన్॥ 5

ఉ॥ అంతట వారలెల్ల రమితాదృతి మీఱఁగ జేరఁ బిల్చి న
న్నెంతయు గౌరవించి వచియింతురె! స్వామి! భవత్పవిత్ర వృ
త్తాంత మటన్న తన్నయవిధంబున కాత్మముదంబునొంది యొ
క్కింత శ్రమంబువాయ మొదలెత్తితి నాకథ యెల్లఁజెప్పగా॥ 6

ఉ॥ ఏనిట వేసదెంచఁ గతమేమొ! వచింతు వినుండు నన్ను రా
మానుజ నామధేయుఁడని యందురు ముక్తిపురాగ్రహార గ్రా
మీణుఁడ వైష్ణవాన్వయుఁడ మేదుర శ్రీ తురగాస్య మంత్ర సం
ధానగ సంస్కృతాంధ్రకవితారచనామహితప్రసాదుఁడన్॥ 7

గీ॥ అమల "వేదాల" "తట్టా" స్వయాంబురాశి
రాజ "తిరువేంగళార్య" "శ్రీరాఘవార్య"
దేశికద్వయ సత్కృపాదీయమాన
సాహితీ సంప్రదాయ విశారదుండ॥ 8

గీ॥ పంచమోల్లాస కలిత ప్రబంధమొండు
రచన చేసితి మొన్న నిర్వచనముద్ది
ఆఖ్య "మురళీధరవిలాస" మనఁగఁ బరగు
గాథ యింతయు స్వకపోల కల్పితంబు॥ 9

ఉ॥ ఆరయ వాసుదాసు మొదలైన కవుల్ కవితారసంబు ని
చ్చోఁ; రుచిఁజూపి నారలసుచున్నదియుంటిని దాని మీరు వి
ద్యాధనసిరావతంసులుగదా యని లోన ముదంబు నొంది నే
ఁ జేరితి నీదకే కృతిని స్వీకృతిఁ జేసెదు వానికోసమై॥ 10

ఉ॥ సారమతుల్సెదాసన; ప్రశస్తివహించి; స్వతంత్ర కావ్యమ
న్పేరున వ్రానె; ముమ్ము కవి " పింగళిసూరన " తత్కవిత్వవా
గ్ధోరణి ముందు నాకవిత "ధూ" యనిపించును గాని; నూత్నగా
ధారచనామహోత్సుకత దా నను వీడ దిఁకేమి; సేయుదున్॥ 11

ఉ॥ కాన; మతాక్కమోట: సపకల్పితవస్తుకథావిశేషసం
ధానమునందు గాని; కవితా విషయంబునఁగాని నాకు వి
జ్ఞానము చాల దైనను లసత్తురగాననదైవ సత్కృపా
ధీనుఁడ నౌట నీకృతిని ధీరులు మెచ్చ రచింప గల్గితిన్॥ 12

ఉ॥ ధారణ శక్తి గల్గి బహుధా ప్రసరత్కవితాసుధారసో
దారత గల్గి నూతనవిధారచనాగరిమంబు గల్గి శ్రీ
సారము గల్గి దైవత విచారము గల్గి సుసంస్కృతాంధ్ర భా
షారుచి గల్గి మించు కవిచంద్రుఁడు కేవల కల్పనా చమ
త్కారితసుంది విజ్ఞులకు దానొసగూర్చు రసానుభోగమున్॥ 13

ఉ॥ కేవలకల్పనాకథలకే రుచి గల్గునుగాని పూర్వనా
నావిధకావ్యవృత్త రచనావిధి మెప్పును జెందదారయన్
భావకులైన వారలకు వాసిని జూచిన పుష్పకంబె నె
త్తావులు గుల్కు నూతనలతాస్తమె మిక్కిలిమోదహేతువా॥ 14

ఉ॥ సరస కవిత్వ వైఖరి రసజ్ఞుల సంతసపెట్టఁజాలు సు
స్థిరరసపూర్ణవాక్యఘటనాచణుఁడైన కవీశ్వరుండు పు
ష్కరకవితావిధానమును జెప్పుట కెంకవిరాజుఁ జూడ ని
ర్వురును సమానులన్నసరిపోల్పని సామ్యము మెత్తురే బుధుల్॥ 15

సీ॥ అర సున్నాలను నింపు సున్నలను క్రియ్యావళ్ళ దీర్ఘాల ప
ల్పుల గిల్కొత్తులకట్లఁ గొమ్ములను సారస్యప్రథామాడఁడై

యరయున్నపుడైన నెక్కవి బుధుండో సత్కవీశుండు సు
స్థిర కావ్యోజ్జ్వల భావకల్పన చమత్కారంబె యెంచున్నదా? 16

ఆ॥వె॥ అఖిల జనుల మనము లానందమున నుంచు
గోకిలంబు హాయి గూయుచుండఁ
జంప బుద్ధి పుట్టు సహజ వాంతునకైనఁ
గావు కావటంచుఁ గాకిగూయ. 17

ఉ॥ అరయ సుపాసనాబల మహత్త్వముచేఁ బ్రతిభాప్రకర్షవి
స్ఫురణము గల్గి నైకవిధ సుందరకావ్యములన్రచించు ధీ
గరిమ గలట్టి ప్రాక్కవులకంటె రసోచితరీతి నెన్ని య
క్షరములకన్నిలక్షల నొసంగిన భోజుఁడె వంద్యుఁడౌఁగదా. 18

ఉ॥ కారణమేమనంగ; సకల్పితయోగ్యరసానుకూలవా
చారమణీయకావ్యవిలసత్కవితామకరందవాహినీ
ధారల మాధురీరుచికిఁ దిస్మయుఁడౌచు యథోచితంపు స
త్కారములంగవుల్పడిస కష్టమెఱింగిన దాతయౌటచేన్. 19

ఉ॥ అట్టి రసజ్ఞుఁడైన వసుధాధిపుఁడిప్పుడు కంచువాగడా
ల్పట్టి పరీక్షసేసినను వెత్తితనంబగుఁగాని కంటఁ గ
న్పట్టునె పట్టిమాట కవిభాగ్యమదంతటితోడఁబోయె ని
ప్పట్టున నేను సత్కృతుల వ్రాసినమాత్రన లాభమున్నదే. 20

ఉ॥ సరసతగల్గినట్టి నవిపంర్రుదులు జ్ఞానముగల్గికూడ న
ప్పరిషుని చేసఁగఁటంది పరసత్కవిసత్కృతిభావమై భరీ

గరిమ నెఱుంగరేరు కలికాలమదిట్టులఁగాలుచుండె నె
క్కరణి మదీయసూత్నకృతిగౌరవమెందునొ తోఁచకుండెడిన్.

ఉ॥ ఆరయ నాకుఁ బూర్వజనురార్జితపుణ్యవిశేషలబ్ధసం
స్కారపరీమళంబుననొ : కాక హయాననదైవమంత్ర సం
ధారణవల్లనో ? బహుబుధప్రవరార్చనచేతనో ? మహా
ధారగలట్టి సత్కవిత దాఁలభియించె విచిత్రవైఖరిన్. 22

ఉ॥ కలమును బట్టుకొన్నఁదురగాననమంత్రసదానుభావనా
బలమున వ్రాయుచుండుదును భాసురరీతి నిసర్గధోరణీ
లలితములైన పద్యములు లక్షలకొద్ది మతేమిలాభ మీ
కలియుగమందు నేఁబడిన కష్టమెఱింగిన దాతలుండిరే 23

ఉ॥ కాలముఁజూడ నిద్ది కలికాలముగావున దీనినమ్మగాఁ
జాలరు గాని పూర్వమున సత్కవులందఱుఁగూడ నేమహా
కాళినొ ? పూజసేసి బహుక్రమకవిత్వమునంది గొప్ప గ్ర
న్థాలను వ్రాసినారమన సమ్మినవారిది నమ్మకుందురే ?. 24

ఉ॥ అదియునుఁగాక పూర్వకృతులన్నఁ బురాకవులన్న గౌరవా
స్పదములుగాఁగ నెన్నుదురు పండిత పామరులెల్లగూడ న
ద్యుది పరిపాటియయ్యె జగమందున సూత్నకవిత్వమన్న స
ద్ధృదయముగూడఁ గుంటివడు దీనికి హేతువు కాలమేగదా? 25

ఉ॥ కాలముగాదు పూర్వకవికావ్యములన్నియు గొప్పగొప్ప భా
వాలకుఁ దావలంబులని పల్కెదురా? యది పాటిగాదు సు
శ్రీలు దెలంగునట్టి కవిశేఖరులెన్నటికైనఁ గాని యే
మూలనొ యుందురంచు భవభూతి మహాకవి పల్కెదొకో? 26

ఉ॥ కావున నేను జెప్పునది కాలముచేతనె మంచి చెడ్డ సం
భావనఁ జేయఁగూడదది పామరపద్ధతి ప్రాజ్ఞవీనవా
చావిషయజ్ఞుఁడై రసవిచారణజేయగలట్టివాడె మే
ధావి, యశస్వి, సత్కవిప్రధానుఁడు, మిక్కిలి వందనీయుడున్. 27

ఉ॥ కాలము మాఱిపోయెఁ గలికాలముచూడఁగ రాసురాను పా
పాలకుఁ దావలంబగుచుఁ బాడయిపోయెను దానధర్మస
త్యాలనఁ దాగుకొన్నవి వృథాశ్రమయౌనుగదా? తలంప నీ
లీల దివానిశంబు మృదురీతిఁ గృతిన్రచియించు టెంతయున్ 28

ఉ॥ రాయలు దాటిపోయె గవిరాజుల భాగ్యపురేఖ మాయమై
పోయెఁ దదీయదివ్యమహిమోన్నతిఁ జాటెడు రాజలోకండు పేఁ
దాయెఁ గవుల్దరిద్రులగుచాశ్రయమెచ్చటలేక లోన హా
హా! యని కుందుటాయెఁ గవులాట పురాకృతకర్మమే సుమీ-

ఉ॥ ధోరణి సంతతంబు హృదిదొర్లుచునుండును వ్రాయబోవ సం
సారపు బాధలేమియును సాగఁగనీయవు యూరకున్న మ

స్తారమరందతుల్యరసంబునుఁజూచిన యప్పుడెల్ల నే
నారయఁ దీర్పరాని హృదయవ్యథచేతఁ దపించుచుండెడిన్. 30

ఉ॥ ఈగతి జెప్పి నేను ముగియించినపిమ్మట వారలెల్లఁ జే
తోగతి సంతసించి నను దోరపుభక్తి బ్రశంసచేసి మీ
చేగదితప్రబంధమున శేషముగాక వచింపుఁడయ్య యే
భాగము తీసియున్న నొకపైపు కథాస్థితిఁ గొంతచెప్పితిన్. 31

ఉ॥ అంతటవారియందు విమలాత్ముఁడు "వేంకటసర్పిరెడ్డి" యె
స్వంతసమాత్మరేఖావగ సాగి నమస్కృతిజేసి సామి ? మీ
యంతటి సత్కవీశ్వరుల యాచితులై యిటువచ్చిరన్న మా
కెంతయు మోదమయ్యె ఫలియించెఁ బురాభవపుణ్యమెంతయున్

ఉ॥ స్వామి ! భవత్ప్రణీత కృతిబంధము చారుకవిత్వధోరణీ
ధామము భక్తిబోధకము తద్జ్ఞజనస్పృహణీయదివ్య వా
చామహితంబు పేశలనిసర్గమనోహరభావవైఖరీ
స్థేమము నూత్నకల్పనవిశేషచమత్కృతి వీక్షణీయమున్. 33

గీ॥ కాన, మీకృతి మీతాతగారిపేర
నంకితమొనర్ప మిమ్ముల నడుగుచుంటి
"సప్తసంతానములలోఁ బ్రశస్తిగాంచి
ఖిలముగాకుండునది ధాత్రిఁ గృతియెగాన" 34

వ॥ అనియీరీతి వచించి నాకపుడె స్వీయాగారసీమన్ సద
క్షిణ తాంబూలమునిచ్చి నవ్వుచు స్వవంశీయ ప్రధానంబు నె

ల్లను వ్రాయుచుచు వంశవృక్షయుత పత్రంబొండు నాకిచ్చి పొ
మ్మని పంపెన్ కలగొట్లవంశజుఁడు లక్ష్మారెడ్డి పుత్రుండొగిన్.

సీ॥ శ్రీమద్రమానాధ నామమంత్రోపాస
నాధురీణులు పాకనాటిరెడ్లు
సత్రనిర్మాణాది సత్క్రియావిధ సము
న్నతయశస్కులు పాకనాటిరెడ్లు
దారిద్ర్యదేవీ విహారప్రదేశ మా
నవపోషకులు పాకనాటిరెడ్లు
రామాయణాది సద్గ్రంథార్థపరిశీల
నామనస్కులు పాకనాటిరెడ్లు

గీ॥ స్వారాజ్య సామ్రాజ్య సౌభాగ్యపాలనాక
నన్మకుటధారకులు పాకనాటిరెడ్లు
అట్టి శ్రీపాకనాటిరెడ్డ్యన్వయంబు
కలదు పైఁజెప్పినట్టి చాగంటివారి
పాలెమందున సత్కీర్తి భరితమగుచు. 36

గీ॥ అట్టి శ్రీపాకనాటి రెడ్యన్వయమున
గలదు పులిగోళ్ళగోత్ర సంకలితమైన
భవ్యకలగొట్లనామాప్తి వరలుచుండు
వంశమొక్కటి కవి మతిపాత్రమగుచు. 37

ఉ॥ ఆకలగొట్ల వంశమున సంబుధికిందుఁడునా జనించె సు
శ్రీకుఁడనంతరెడ్డి మురళీధరదివ్యపదాంబుజాత చిం
తాకలనాపరాయణుఁడు న్యాయపథస్థుఁడు సత్యభాషి సు
శ్లోకి తటాకధర్మవిధిశోభితభాగ్యుఁడు త్యాగభూషుఁడున్. 38

కం॥ పరమతరాన్వయజాతన్
స్ఫురదురుసౌశీల్యధన్య ముత్యాలమ్మన్
కరమనురాగము మీరఁగ
సరయఁగఁ బెండ్లాడి సుఖమునందెనతండున్. 39

ఉ॥ వారిసుతుండు నిర్మలినభావుఁడు శ్రీపరదేశిరెడ్డి వి
ద్యారుచిగల్గియుండుటనహర్నిశమెప్పుఁబురాణమేదొ తా
నారయుచుండి కొంచెముగ నర్థముఁగూడపఠింపఁగల్గి దా
పేరుప్రతిష్ఠగాంచె గుణవృద్ధులుమెచ్చగ నెల్లకాలమున్. 40

ఉ॥ అమ్మహనీయభావునకు నాటికళత్రము దివ్యశీల కో
టమ్మ పతివ్రతాతిలక మాడదసత్యము నెన్నఁడైనఁ గో
పమ్మనులేదు పెద్దలగువారిలఁ జూచిన గౌరవించు నా
యమ్మకు ముప్పురాత్మభవులాత్మజయొక్కతె చిన్నభార్య రం
గమ్మ నిజాత్మనాథపదకంజయుగంబును సంతతంబు చి
త్తమ్ముననిల్పిభావనముదానొనరించుచుభర్తృభక్తి సీ
తమ్మవిధాన రాజిలిసుతాతిలకంబులగాంచె నిర్వురన్. 41

ఉ॥ ఆపరదేశిరెడ్డి తనయత్రితయంబునఁ బెద్దవాఁడు ని
ష్టోపుఁడు కోటిరెడ్డి నయసూరి ద్వితీయుఁడు నర్సిరెడ్డి శ్రీ
దీపకుఁ డద్రిధీరుఁడు తృతీయుఁడు వేంకటరెడ్డి పుత్రి శ్రీ
రాపరలక్ష్మియంచు ప్రథనందిన శ్రీయలివేలమాంబయున్. 42

ఉ॥ ఆపరదేశిరెడ్డి ప్రథమాత్మభవుండగు కోటిరెడ్డిగా
రీ పృథివీతలంబున సహీనయశోధనముఁ గణించి దాఁ
దాపము మాయమయ్యె నటువంటి శుభాత్ముని పేరు శాశ్వత
స్థాపనఁ జేయ నాకృతినొసంగితి వానికిఁ బ్రేమ పేర్కొనన్. 43

సీ॥ పరమభక్తుండను ప్రథకుఁ దార్క్యాణమీ
యంజనాతనయ దేవాలయంబు
ధార్మికుండనుటకుఁ దార్క్యాణమలరహ
ధారి మువ్వాళ్ళసత్ర ప్రతిష్ఠ
దాతృత్వనిధియనఁ దార్క్యాణమగు సల
కట్టువలో నిడురాగిగంజిపోఁత
బహుశాంతుఁ డనియెడు ప్రథకుఁ దార్క్యాణ మా
యొద్దెలకొసగిన యోగిరంబు

గీ॥ రసికుఁడనుటకు గొప్పతార్క్యాణ మిట్టి
కృతిని నీకంకితంబు చేయించుటరయ
బళిర ! మృతజీవులగు యశోభరితులందు
మేటియగుఁగాదె కలగోట్ల కోటిరెడ్డి. 44

సీ॥ వాసుదేవయానాథ భక్తాపతంసవా
తాత్మజపాదసేవాస్పదుండు
శ్రీరాజయోగాఖ్య సిద్ధాంతబోధన
విధిసమాదర్శితావేశభయుఁడు
ధర్మకార్యక్రియాతాత్పర్యసంతోషి
తాశేషజనహృదయాంబుజుండు
స్మితపూర్వభాషణ శ్రీవశీకృతసర్వ
మానవవ్రజేగీయ మానయశుఁడు

గీ॥ పండితప్రియుండు మధురసంభాషణుండు
శాంతిసుగుణాభిరాముండు సహృదయుండు
శ్రీల చాగంటివారిపాలెం నివాసి
గురువులకు వేల్పుగిడ్డి శ్రీకోటిరెడ్డి. 45

శా॥ అన్నా! రెడ్డికులావతంస! మహనీయప్రజ్ఞ! దేవాంశసం
పన్నా! ధన్యుఁడవీవు నాకృతిని సంభావించితింకేమి నీ
కున్నేమంబున మోక్షమేకలుగు నాకున్గూడఁ జిత్తంబునం
దెన్నన్సంతసమయ్యెఁ దావక యశంబీరీతి వ్యాపింపగా. 46

ఉ॥ నాకృతి భక్తిమూలము సనాతనధర్మపరాయణుండ వీ
వేకరణిం గనుంగొనిన నిట్టిప్రయత్నము యోగ్యమేకదా
నీకొరకేమొనేను నవనీతసమానకవిత్వధార సు
శ్రీకృతి వ్రాసినాఁడ మృదురీతినిఁ కేటికి స్వీకరింపుమా? 47

ఉ॥ నీవిటలేకపోయినను నీకదియేమికొఱంతలేదు వి
ద్యావిషయజ్ఞ ! నీమనుమఁడై చెలువొందెడు నర్సిరెడ్డి యం
దావిమలస్వభావమది యంతయు నచ్చుగ్రుద్దినట్టు సు
శ్రీవిలసిల్లుచుండఁగ సరే యని సంతసమొందితిన్ మదిన్. 48

ఉ॥ ఆరయ నీవు సాకృతిమహోద్ధృతిమీరఁగ నందితేని మం
దారతరుప్రసూనభరదామములన్నినుఁ బూజచేసి బృం
దారకవారకాంతలు సుధామయవాక్కుల సత్కరించి ప్రే
మారఁగ గౌఁగిలింతల కహో యనిపింతురు సద్యశోనిధీ ! 49

ఉ॥ ఈతని ధర్మకార్యముల నెల్లలిఖింపఁ బ్రబంధమౌనిటీ
వ్రాఁతకె పెర్గిపోయెఁగృతిభారతమంతగఁ గోటిరెడ్డి మున్
వాతతనూజుమీఁదఁ గవివర్యుఁడొకండు కృతిన్రచింపఁ దా
నాతనికిచ్చె నూటపదియాళ్లను నెంతరసజ్ఞుఁడోగదా. 50

చ॥ చిరునగవెప్పుడోష్ఠపుటినీమనుఁ జిందులుదొర్లుచుండు సు
స్థిరనయనంబులెప్పుడు కనజ్జలజంబులనంగనొప్పి దు
ష్పురుషతలేని దృష్టుల ప్రసారముచే వెలుఁగొందుచుండు నా
నరసునకా "ఫొటో" గనుఁడుచాటునుసత్యము లేక సత్యమో.

ఉ॥ శ్రీలుచెలంగ సర్వ్వరు విశేషముగా నడయాడుచుండు ము
ప్పాళపుగ్రామమందున నెబాసన సత్రముగట్టితీవు చా
ల్పాలును కీసనీకిహపరంబులు రెండునుగల్గెనయ్య మీ
పాలెపుకీర్తి నీవలనఁ బ్రాకెఁజుమీ ! దిశలన్ సుహృన్మణీ! 53

ఉ॥ అన్నియుఁ జెప్పలేయగును నాఖర "కుమ్మెత" గూడ పువ్వె దే
మున్నది లాభమందు సుగుణోన్నతిఁ జెందు గులాబిపుష్పమే
పన్నెకుపచ్చ సల్లె ధనవంతులమేమని విఱ్ఱవీగు వెం
కన్న లిఁ జెందియుండిరటుగానొకఁడైనను నిన్నుఁబోలునే. 54

ఉ॥ అమ్మహితస్వభావుఁడు శుభాత్మయటంచు నుతింపజాలు నో
టమ్మను బెండ్లియాడె నసలామె నటం ద్రుపతిప్రతాసుతే
జమ్మునఁ బుట్టెనంచు నవసానదశాస్థితినందికూడఁ జి
త్తమ్మున భర్తృభావనమెదక్క నెఱుంగదు విష్ణునామమున్.

శా॥ ఆసుశ్లోకుఁడు కోటిరెడ్డి వినయవ్యాపారులన్పుత్రుల
శ్రీసంపన్నుల మువ్వురంగని గతించెన్ వారతే వీరు వా
చాసంతోషిత పద్మనాభుఁడగు లక్ష్మారెడ్డి వేదాంత వి
ద్యాసారజ్ఞుఁడు బాలిరెడ్డి సుగుణుండైనట్టి పర్దేశియున్. 55

శా॥ సారాచారవిచారశీలుఁడగు లక్ష్మారెడ్డి నారాయణో
దార శ్రీచరణాంబుజ ద్వితయచింతాసక్తుఁడై సల్వురన్
శ్రీరంజిల్లెడు పుత్రులంగనియె వారిన్ రాధికాభర్త పేర్మి
మీరన్ రక్షణఁజేయుఁగాక తతభాగ్యంబిచ్చి యెల్లప్పుడున్. 56

—— షష్ఠ్యంతములు. ——

కం॥ ఏతాదృశగుణనిధికిన్
సీతాప్రాణేశపాదసేవారతికిన్

భూతల దైవకృతాశీ
ర్వ్యాతశ్లోకప్రభావపీఠ్యవిఠనవికసా. 57

కం॥ పావనవారతనూభవ
దేవాలయ ధర్మకార్యదీపిత వితత
శ్రీవైభవ పరితోషిత
భావునకు రాజయోగ పరిణితమతికిన్. 58

గీ॥ అమల కలగోట్లనామవంశాబ్ధి పూర్ణ
చంద్ర శ్రీకోటిరెడ్డి సౌజన్యనిధికి
నస్వవాయాభివృద్ధిగా నస్మదీయ
కృతికి గాధావిధాక్రమం బెట్టిదనిన — 59



శ్రీగుడిమెళ్ళవంశమణి శ్రీలపిఠాపుర రాట్సుధా మహా
భాగ ప్రతీక్ష్యరంగ గురుబ్రహ్మ రథోత్సవ వైభవంబు శ్రీ
భాగవతోత్తమాశిషమువల్లనొకింత కొఱంతలేక కొ
న్నాగిన సంతసించి మఱునాఁటి సుఖంబుగ నేబరుండితిన్. 60

ఉ. అత్తరి నేదియోయొక మహాపరిణామము చిత్తమందు రే
కెత్తగ మౌనభావమునఁ గొందొకసేపు హయాస్యమంత్ర సం
పత్తి విశేషవైఖరిని భావనచేయుచు నిద్రబోవ లో
కోత్తరపుణ్యశీలులగు కొందఱు శ్రీయుత వైష్ణవోత్తముల్.

ఉ॥ వేకువజామునందుఁ గనుపించిరి వారలు నూర్ధ్వపుండ్రరే
ఖాకమనీయఫాలురు విస్స్వరకోమల దివ్యమంగళ
శ్రీకరదేహధారులు శుచిస్మితశోభితులంబుజాక్షమం
త్రాకలనాపరాయణులు తప్తసువర్ణమయాంబరోజ్జ్వలుల్. 62

ఉ॥ హారకిరీటకుండల మహాభరణాది సమస్త రత్నభూ
షారచనామనోహరులు సస్మయస్ఫుటదబ్జపత్రశో
భారమణీయలోచనులు భవ్యమనస్కులు కోటిమన్మథా
కారులు భక్తులందునను కంపవహించెడు సత్వమూర్తులున్. 63

ఉ॥ అంతటవారికోమల మహత్తరరూపవిశేషసంపద
త్యంతవిలోకనా పరవశంబునఁ గొందొకసేపు నేను వి
భ్రాంతుఁడనై పదంపడి విభాస్వరతన్మృదుపాదపద్మసీ
మాంతమునందు సాఁగిలియమాంతము వ్రాలినమస్కరించితిన్.

ఉ॥ ఎచ్చటనుండువారలిట కేమినిమిత్తము వచ్చినారలీ
రిచ్చముగా ముకుందలసదంఘ్రి సముద్భవులౌదురంచు నా
కెచ్చటనెంచుచున్నది యహీనవిశుద్ధచరిత్రులార ! మీ
వచ్చినకారణంబెఱుఁగవచ్చునె దాసుఁడు సాభిలాషుఁడై. 65

ఉ॥ ఆరయమీరు విష్ణుసుగుణానుభవంబునుజేసి ఘోరసం
సారపయోధిదాటి విరజాసరిదూర్మిసుధావగాహన
శ్రీరమణీయమంగళశరీరగులౌచు స్వయంప్రభామహో
దారవికుంఠలోకమునఁ దద్దయునుండెదు నిత్యసూరులా ! 66

ఉ॥ కాక: నిరంతరంబిటఁ గామ్యఫలప్రదయాగకారప
శ్లోకమునానొసర్చి కడుశ్రోత్రియపద్ధతి నుద్ధరించి గం
గాకమలానిలాంచిరవికాసిత నందనకుంజలీనరం
భాకలితాధరామృత మమత్వమునందెదు పుణ్యమూర్తులా ! 67

ఉ॥ లేక : కళిందపర్వతదరీప్రభవద్యమునాతటీగ బృం
దావనసీయ కాననలతాభవనంబులఁ గోటిమన్మథ
శ్రీకితఁగుల్కుచున్న మురళీధరు నిత్యనివాసధన్యగో
లోకనివాసతంగరిమనక్షతనుండెదు గోపవృద్ధులా ! 68

చ॥ పరమపవిత్ర భాగవతపాదసరోజ రజోవిశేష ధూ
సరితశరీరుఁడై తనరు సజ్జనుఁడారయ సన్యజన్మమి
స్సరణినిఁజెందఁజాలడని సాఁగిలి నేను వకీయ దివ్యసుం
దరపదసన్నిధానమున దండముమాడ్కి నమస్కరింపగా. 69

ఉ॥ వారలు తక్షణంబున నపారకృపారసపూర్ణనేత్ర పం
కేరుహులై సమీపమునఁ గేలుమొగిడ్చి వసించియున్న శ్రీ
సూరిని సౌఖ్యనింగలియఁజూచిన నామహనీయుఁడంతఁ బ్రే
మారఁగ నన్నుఁ జేరిదరహాసవిశోభితభాషణంబునన్ 70

ఉ॥ ఓయి! సుమార! రెమ్మొఁక సహో! భవదీయపురాజసుష్కృత
స్ఫాయుచిగణ్యపుణ్య వనవాటిక పూచిఫలించెనయ్య నా
రాయణరూపచిహ్నల నలంకృత దివ్యశరీరులైన వీ
రే యలనిత్యసూరులని యింపుగఁ బల్కిన సంభ్రమంబునన్.

ఉ॥ బళిరే! దేవరవారలందరును భాస్వత్కోటి మార్తాండ వు
స్తల తేజస్సమునై జకాంతిగవిసన్నభ్యాతలోకంబునం
దుం శేషాహి సహస్రభోగకృతశయ్యాశాయి నారాయణో
జ్జ్వల పాదార్చన మాచరించెడు సదాపశ్యత్సదాసూరులా! 72

సీ॥ కంఠస్థలిలంబి కమనీయతులసికా
కల్పితమాలికా గంధలహరి
అచసీసుసుమపేశలాప్రాకృతోజ్జ్వల
దివ్యమంగళదేహ దీప్తిభరము
శారదేందుప్రభా సరణివిభాస్వర
ద్వాదశపుండ్రోర్ధ్వధవళిమంబు
మహనీయతపనీయ మయపీతకోమలాం
బరకాంతిపై ఖరీ వైభవంబు

గీ॥ మంత్రరత్నానుసంధానమహిమవిచల
దోష్ఠపుటికామనోజ్ఞత్వమో మహాత్మ
లార! మీరలు శ్రీనిత్యసూరులనుచుఁ
జాటుచున్నప్పటికిఁ గూడ సంశయంబు
గలిగె దుర్వార ప్రకృతి సంగతుఁ డనౌట. 73

వ॥ అరరే! నాదుపురాజనూరచిత పుణ్యాస్ఫారసౌభాగ్య వి
స్ఫురణం బిట్టి విశేషమెచ్చటయినస్జ్ఞోద్యంబుగాదొక్కొ శ్రీ
హరి పాదాంబుజదాసులార! భవదవ్యాజోపకారంబు నె
క్కరణిం దీర్చుదుఁగానిచోఁ దతకృతఘ్నత్వాప్తిలో గుందనే

ఉ॥ ఓ మహనీయులార! కరుణోజ్జ్వల విష్ణుపదాంబుజాత చిం
తామృదుచిత్తులార! భవదాగమనంబునఁ జేసికాదె నా
ధామము పూతమయ్యెను గృతార్థుఁడనైతి ముదంబుగల్గె దు
స్తామసమంతరించె గతజన్మశుభంబు ఫలించె నెంతయున్. 75

ఉ॥ సారవిచారశీలురగు సజ్జనులెప్పుడుఁ గూడఁ జూడ నీ
హారసమానమైన హృదయంబును గల్గినవారలౌట నీ
ష్కారణప్రీతి లోక కలుషస్థితిఁ బాపఁగఁ జేయుచుందు రా
తీరునఁ గాదె మీరలు మదీయగృహంబున కేగుదెంచుటల్. 76

ఉ॥ కాని మహాత్ములార! భవకత్కమపీయ పదాంబుజాతని
ధ్యానమునన్భవాంబునిధి దాటగనోపుదురస్మదాదు లెం

తేని నిరంతరంబు లస దీశ్వరకోమలదివ్యవిగ్రహా
నూనవిలోకనావిధివినోదులదెంతటి ధన్యులోగదా ! 77

ఉ॥ ఆరయ సర్వవేళల మహాత్మ సుదర్శనపాణిశ్రీపదాం
భోరుహసన్నిధానమునఁ బూజలొనర్చుచు మోదమొందెడా
సూరివరేణ్యులార ! కడుఁజోద్యముగాదె భవత్సమాగమో
దారత దీనికెల్లను బ్రధానవిశేషమదెద్దియోగదా !

ఉ॥ భాగవతోత్తమీయపదపంకజసంతతభావనాఫలం
బా ! గతజన్మపుణ్యపరిపాకవిశేషమ ! దివ్యతీర్థయా
తాగ్రిగమనప్రభావమ ! మురాంతకసేవయ ! హేతువీ మహా
యోగము సంభవించుటకహో కరుణామయులార ! తెల్పరే ! 79

ఉ॥ దాసజనావనోద్ధరణ తజ్జ్ఞులువారెడు భార్గవీమనో
వాసునిదాసులార ! మముపంటి దురాత్ముల నుద్ధరింప పేం
చేసిన పుణ్యులార ! భవచింతలచేతఁ గృశించుచున్న యీ
దాసుని నుద్ధరింపుఁడు సుధారసశీతల వీక్షణంబులన్. 80

ఉ॥ దేవరవారలందరకు దేనినిమిత్తము దివ్యకాంతి సం
భావితమైన చక్రధర పత్తనమున్విడనాడి ఘోరపా
పావిలలోకమందున సదాటనఁజేయఁగనుత్సహింత్రు బృం
దావనచారిభక్తులకు దాసుఁడువచ్చెనె నేఁడు జ్ఞప్తికిన్. 81

ఉ॥ నేనిటనుండఁజాల నవనీతసమానమనస్కులార ! మీ
తో నను వెంటబెట్టుకొని దోడుకపొందు పరాంగనాకుచ

ధ్యానమలీమసాత్ములకుఁ దావలమౌ కలికాలమందు దు
ర్జ్ఞానత నుంటకంటె నిమిషస్థితిచాలదె సూరిసన్నిధిన్. 82

ఉ॥ పాపము మాలిపోవుట శుభంబులు పెంపువహించుచుంట సం
తాపము లాఱిపోవుట యధర్మపరత్వము వృద్ధియౌట దు
ష్కోపము శాంతినొందుటలు గోరినకోర్కెలు సిద్ధిఁగంట ప
ద్మాపతిపాదసేవకుల దర్శనమాత్రముచేతనేకదా! 83

ఉ॥ ఇటనిఁకనుండఁజాలనని యెన్నివిధంబుల వేఁడుకొన్న మీ
రిటునటుఁజూచి నవ్వెదరదేటికిఁ జెప్పుఁడు దోషపుంజ సం
ఘటనము యుష్మదీయ బహుకమ్రపదాంబుజ శ్రీవిలోకనా
ర్భటులఁదొలంగఁగాదె తమవద్దను దోషియు ధన్యుఁడౌఁగదా.

ఉ॥ ఔను శతాపరాధుఁడ మహాత్ములదూషణఁ జేయువాఁడ సుం
తేనియు దాసధర్మమని దీనులకీయఁగలేదు యొక్కసా
రైనను రామ కృష్ణ యను టంతకుమున్నె హుళక్కి దారసం
తానములందునున్న మమతల్విడిపోవఁగఁజాల నెంతయున్ 85

ఉ॥ ఈదృశదోషదూషితుఁడ నెట్లు పవిత్రముకుందలోకసం
పాదనఁజేయ నర్హుఁడని పల్కుననవ్వితిమంటిరా! భవ
త్పాదసరోజపాంసు పరివర్తన ధూసరితోత్తమాంగుఁడ
య్యా దరిఁజేరలేడె కలుషాంబుధిదాటి పునీతచిత్తుఁడై. 86

చ॥ అదియునుఁగాక సర్వవిషయంబులు మీకువిదంతవాసిశ్రీ
పవనశిసద్వయీనసతతభావనసంగతదివ్యదృష్టి సం

పదనపగాహితంబులగు భాగవతో త్తములార ! గాన మీ
పదములు పట్టుకొంటి నతపాలకదృష్టి ననుగ్రహింపుఁడీ. 87

ఉ॥ దీనజనావనోద్ధరణ దీక్షవహించిన సూరులార ! మీ
రేనియు నిట్టిదాసుని శుభేక్షణదృష్టి ననుగ్రహింపరే !
హా ! నవనీతమందురె మహాత్ములచి త్తమదేది యింక రా
మానుజుఁడేమిగావలయునంచు మహ త్తరరోదనార్భటిన్ 88

ఉ॥ వారిపవిత్రపాదములపైఁబడి లేవక రోదనార్భటీ
ధారముచేత నట్టిశలు ద్రబ్దలుచేయుచునున్న నన్నుఁ బే్రి
మారఁగ నట్టెచూచి విమలాశయుఁడొక్కఁడు లేపనె త్తి మం
దారమరందతుల్య వచనంబుల మెల్లగ బుజ్జగించుచున్. 89

ఉ॥ నాయన ! చింతపెట్టకు మనంబుననీకు శుభంబుగల్గు నా
రాయణపాదపద్మమున హర్నిశమున్భజియింపుచుండు మే
మీయెడకేగుదెంచఁ గతమేమనఁ జెప్పెద మాలకించవ
య్యా! యిటురమ్మటంచుఁ జెవియందువచించెనుదద్రహస్యమున్.

ఉ॥ ఈవిషయంబు నెన్నఁటికి నెవ్వరితోడ వచింపకో చిరం
జీవి ! మతొక్కసంగతి విశేషము మేమిట నిల్వఁజాలమీ
పావనమూ ర్తిగాథ కలిపాపహరంబగుగాన నీవు గౌ
రీవిభుమౌళినిస్రుతసరిద్రయతుల్యకవిత్వధార సం
భావనఁజేసి సత్కృతిగ వ్రాయుమటంచును జెప్పి వెండియున్

ఉ॥ కావునఁ గొంతకాలమిటు కంజదళాయతనేత్రపాద సం
భావనఁ జేయుమద్ది కలిపాపముఁ జేరఁగనీయదో చిరం
జీవి! ముకుంద దివ్యగుణచింతనకంటె దపస్సు యాగదీ
క్షావిధి గొప్పగాదపరజన్మనివృత్తికి నీయుగంబునన్. 92

ఉ॥ అన్నిటికంటెహేయవిషయాదృతినందక శాంతిదాంతి సం
పన్నత నొంది శ్రీగిరిమఖాసిలు పెద్దల గౌరవించుట
త్యున్నతమైన పద్ధతి మహోజ్వల భక్తి కుమార! గాన నీ
కెన్నఁటికైనఁగాని యిదియేసుమి మిక్కిలి ముఖ్యమీధరన్.

చ॥ అని మతియేమొచెప్పుతతి సంతటనేను మహాసుధాప! దా
సునకొకసంశయంబు కృపజూతురెయంచు వచించుచుండ ని
స్వనగతివారదృశ్యులయి సాగిన దుస్సహతద్వియోగరో
దసమొనరింపభీతిఁ జెయిఁదట్టి సతీమణినిద్రలేపినన్. 94

గీ॥ తక్షణమనిద్రమేల్కాంచి తత్తరమున
వెదకితి సదెద్దియో పాఱవేసినట్లు
కొంతపఱకిద్ది కలయని శాంతి నొంది
దీనివిషయంబు నించుకదెలియగోరి. 95

ఉ॥ ఆమఱునాఁడు నేనొక మహాత్ముని సన్నిధికేగి తత్పురో
ధామమునందుఁ గొంతవడి దండముమాడ్కి నమస్కరించి యో
స్వామి! సుధీమణీ గతనిశాంతమునందొక వింతస్వప్నము
ద్దామగతిన్లభించెనని తద్విధమంతయు విన్నవించితిన్. 96

ఉ॥ అంతటనాబుధుండు తనయా ! యిటమూఁడుదినాలనుండి శ్రీ
మంతుని వైదుషీవిషయమాస్యచరిత్రుని పీఠికాపురీ
కాంతసభాసమర్చితునిఁ గౌరవరీతి భజించుచున్న నీ
కింతటి యోగమబ్బుటను నేమివిచిత్రము తత్వమెన్నఁగా. 97

ఉ॥ ఆరయ నీవు దీనివిషయంబున శ్రద్ధవహించియుండి చి
త్సూరి కథావిశేషమును సుందరరీతి రచింపుమయ్య ధీ
సారము భావపోషణము శ్రావ్యకవిత్వము కల్పనాచమ
త్కారము తత్కథా విషయధారణ పెంపువహించుచుండు ప
ద్మారమణీ హృదీశపదదాసమహాత్ముల దర్శనంబుచే. 98

గీ॥ సత్యమో లేకసత్యమో జరిగినట్టి
దిద్ది, పాఠకు లేమైన నెంచుకొనుఁడు
కలఁడు కలఁడన్న దేవుఁడు కలఁడుగాని
లేడటన్నచో నాతఁడేరీతినుండు. 99

గీ॥ స్వప్నసాక్షాత్కృతోత్తమ భాగవతకృ
పాకటాక్షవీక్షాపరీపాకగరిమఁ
దన్మహాసూరి దివ్యవృత్తాంతమెల్ల
రచనఁజేయుదుననెడి ధైర్యంబుగలిగె. 100

ఉ॥ శ్రీపులిగోళ్లగోత్ర కలశీజలరాసి మృగాంక ! భూమిపు
త్రీపతి నామమంత్రవిమలీకృతమానస ! దానకర్ణ ! ధై

ర్యాపరమేరుధాత్రి ! సుగుణాస్పద బ్రాహ్మణపోషణైకదీ
క్షా ! పరదేశిరెడ్డి తనయా ! మితభాషణ ! సత్యభాషణా ! 101

ఇది

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్య విరచిత
మురళీధరవిలాసంబను
నిర్వచనప్రబంధమందు
ప్రథమోల్లాసము.

---

# మురళీధర విలాసము.

## ద్వితీయోల్లాసము.



కం॥ శ్రీకలగొట్ల కులాంబుధి
రాకానీహారకిరణ! ప్రథితవితరణా!
లోకారాధ్యచరిత్ర
శ్రీకాంతాదయిత పాదసేవాభరణా! 1

గీ॥ ఎవ్వఁడాసూరి యిచ్చటనేమిచేసి
ముఖ్యమగునట్టి నిత్యవిభూతికేగె
తత్పురంబెద్దియను తత్కథావిశేష
విషయమంతయు వివరింతు వినఁగదయ్య. 2

ఉ॥ ధారణిఁ బుణ్యభూమియని తద్దయుఁ బేరుగడించుకొన్న శ్రీ
భారతఖండమందు నొకవైపున నందపురాగ్రహారమ
న్పేరునఁ బల్లెటూరొకటి నిత్యవిభూతివిధంబుగా సదా
సూరి విరాజమానమయి శోభిలుచుండె విచిత్ర వైఖరిన్. 3

ఉ॥ దానిసమీపమందె సతతస్రవదచ్ఛపయఃప్రపూర్ణ కృ
ష్ణానదిపాయయొక్కటిప్రశాంతగతిన్ బ్రవహించుచుండె; పం

దానిలలోలతీరవివిధద్రుమపుష్పగలన్మరందధా
రాసపగంధవాసితతరంగపరస్పరఘర్షణాప్తిచేన్. 4

ఉ॥ ఆలలితాగ్రహారమున సద్భుతశోభఁ జెలంగుగొప్ప దే
వాలయముందె సందుజనతార్తిహరుండగు వేణుపాణి స
త్యాలలనామణీ ప్రణయదాస్యవిధానవిధేయతాప్తిఁగా
బోలు పసెంచియుంట జనమోహకరస్పృహణీయరూపుఁడై. 5

ఉ॥ శ్రీలసుఁదాపలంబగు కిరీటము శీర్షమునందుఁగుల్క వ
క్రాలికపాళి ఫాలఫల కాంతరసీమఁజెలంగ దివ్యవం
శీలత కోమలోష్ఠపుటిఁజెన్నువహింపఁదదగ్రహారదే
వాలయమందునున్న కమలాక్షునిఁజూచిన జన్మమున్నదే. 6

ఉ॥ స్ఫీతకృపా సుధాలహరి శీతలకోమలకాంతి దివ్యప్రా
భాతికబాలభానురుచి వైభవ పుల్లసరోజపత్ర శో
భాతతలోచనద్వయ విధాస్వయుఁడౌ మురళీధరుండు చే
యూఁతనొసంగుచుండ సుఖమొందుచునుందురు తత్పురీజనుల్

ఉ॥ మోమున ముద్దునవ్వు జనమోహసమై వెలుగొందుచుండ ప
క్షోమణికాంతిదేహమున శోభిలుచుండ దయారసంబు దృ
క్సీమఁజెలంగ వేణువాకకేలఁ దళత్తళలీన సత్యభా
మామహిళాసమేతుఁడయి మాన్యులఁబ్రోచుచునుండునాపురిన్.

ఉ॥ ఆతలితస్మితాస్యము మహాత్ములనైనను మోహపెట్టు పా
పాలను రూపుమాపుఁ దొలిబామునఁజేసినయట్టి గొప్ప పు

ణ్యాలఫలింపఁ జేయు హృదయంబునఁ గోరినయట్టి సర్వకా
మ్యాలనొసర్చుచుండు ననుమానములేదిట వేశమేనియుఁ . 9

ఉ॥ అరుణుఁడురాకమున్నె విమలాపగమజ్జన మాచరించి ఛా
స్వరవిమలోర్ధ్వపుండ్రములఁ జక్కఁగఁదాలిచి మంత్రరత్న వి
స్ఫురదధరోష్ఠులై భ్రమిడనూక్తిపఠించుచు నందనూను సు
స్థిరచరణారవింద కలనాదృతినుందురు రిత్పురీజనుల్. 10

ఉ॥ ఆపురినందరుఁ భగవదంశసముద్భవు లంబుజాక్ష చిం
తాపరిపక్వభక్తిగుణధన్యులు ద్వాదశనూర్ధ్వపుండ్రరే
ఖాపరిణాహశోభలవికస్వరదేహులు సర్వశాస్త్రవా
చాపరతత్వనిర్ణయవిచారులు శ్రీయుత వైష్ణవోత్తముల్.

ఉ॥ ఆమహనీయశీలుర గృహంబులు నూటికిఁ బైననుండెఁ గా
నీ; మకరందబిందు కమనీయ నిరంతరధోరణీ మహో
ద్దామ కవిత్వధారగల ధన్యులుకొందఱు పూర్వమందు వి
ద్యామహితాత్ములౌ ప్రభులయండ వసింపఁగనేగి రెన్నఁడో. 12

ఉ॥ అరయ రసజ్ఞులైన వసుధాధిపచంద్రులు పూర్వమందు సుం
దరసుకుమారదివ్యకవితారచనావిధిశక్తి మత్కవీ
శ్వరులను దోడితెచ్చి తమసన్నిధి నిల్పుచునెప్పుడుఁ మహో
దరణపురస్సరంబగు విధంబునఁ బోషణఁజేయలేదొకో. 13

ఉ॥ నేటికిఁగూడ నచ్చట కనీసము నల్బదియిండ్లుగల్గి యే
నాఁటికి మాసిపోవని సనాతనదివ్యయశస్సు దిక్కుల

న్వాటిలుచుండఁ బాడికిని బంటకు నెట్టి కొఱంతలేక పో
రాటములేక నిత్యసుఖులై వసియింతురు తత్పురీజనుల్. 14

ఉ॥ ఎన్నఁగ పల్లెలూరెయగు నీపురమారసిచూడ దానిలో
కోన్నతమై భవంబు మఱియొక్క పురంబునలేదు భాగ్యసం
పన్నత చిత్తశాంతి శుభవర్తన సర్వకలావిలాస సౌ
ఖ్యోన్నతి ధీవిశాలత మహోజ్వలశక్తి చెలంగఁ నెంతయున్. 15

ఉ॥ హాయినిగొల్పునట్టి విమలాంబుభరాలస కృష్ణవేణి కృ
ష్ణా! యని పిల్చువారలను సత్కృపఁగాచెడు వేణుపాణి దే
వీ! యిఁకెనీవెమాకనిన విశ్వజయంబొసగూర్చు వాణి యో
హో! యటవైభవంబు త్రిదశాలయవాసులకైనఁ గల్గునే?

శా॥ సాయంకాలమరుత్కిశోరకలనాసంఫుల్లమల్లీలతా
స్ఫాయత్కుసుమమంజరీ సముదయ ప్రస్యందిమారందధా
రాయాతోరుసువాసనాభరమునన్రంజిల్లు పుష్పద్రుమ
చ్ఛాయావాసతకన్న మిన్నయగునే స్వర్గస్థలీభోగముల్. 17

ఉ॥ అంతములేని శోభ నలరారెడు శాద్వలముల్దినాంత వి
శ్రాంతికిఁ దావలంబులగు చక్కని సైకతభూములున్మన
శ్శాంతినొసర్చునట్టి యదుసత్కులభూషణ వేణుపాణి పా
దాంతికదేశముల్సురలకైనను మోహముఁగల్గజేయవే. 18

ఉ॥ పావనమైన మౌనివనవాటికపోలిక నిత్యసూరి సం
సేవితమై స్వయంరుచివిశేషగనిత్యవిభూతిమాడ్కి సం
భావనఁజేయఁగాఁదగిన భాసురనందపురంబునందు వి
ద్యావసుఁడాది సద్గుణప్రధానతనొప్పెడు కౌన్నివంశముల్. 19

ఉ॥ భాసురకీర్తి భాగ్యమున వాటిలుచుండఁగ వానియందు వి
ద్యాసదనోపనామకమహాన్వయమొండు చెలంగుచుండె న
చ్చో; సకలాగమజ్ఞుఁడును సుందరరూపుఁడు నైష్ఠికుండు వా
చాసరసుండనంగ నొక సాధువుపుట్టె సుధాంశుపై ఖరిన్. 20

మ॥ సమధీశుండు కలాభిరాముఁడు తపస్సంపూర్త సర్వజ్ఞతా
పదకోటీర సమర్చనీయుఁడు జగత్ప్రహ్లాదనోత్కుండు సౌ
ఖ్యదశోభాకరుఁడుల్లసత్కువలయ వ్యామోహి సంభావనా
స్పదుఁడౌ వైష్ణవశేఖరుండు ద్విజరాజఖ్యాతిఁ బెంపొందఁడే.

ఉ॥ ప్రాయము ముప్పదేండ్లకటుపైఁబడియుండదు సర్వశాస్త్ర వా
చాయతనంబు వానిరసనాగ్రము సత్త్వగుణప్రధానుఁడా
ప్యాయనకారిమూర్తి యుభయాగమశీర్ష ప్రబంధసూక్తి పా
రాయణ పండితుండు నయరాజితశీలి మహానుభావుఁడున్. 22

సీ॥ ప్రతిపదప్రస్యంది ద్రాక్షాసుధారస
భరకాళిదాస కావ్యములఁజదివె
పండితరాయాది ప్రాక్కవి కల్పితా
లంకారశాస్త్రమర్మములనెఱిఁగె

కాణాద తర్క విఖ్యాతనానాపూర్వ
పక్ష సిద్ధాంత కల్పనలసరసె
అమల శ్రీపాణినీయాగమభాష్యాంత
పతనపాతన పరిపాటిసందె

గీ॥ ఇరువదై దేండ్లు మించని యీడునందె
పూర్వసంభవ సంచిత పుణ్యనిచయ
పరిణతిసమేధమాన శోభాప్రపూర్ణ
నిర్మలోదార ధీనవోన్మేషగరిమ. 23

సీ॥ భవ్యగీతాశాస్త్ర భాష్యగంభీరార్థ
పరిశీలనక్రియా పటిమఁ గాంచె
శ్రీభాష్యకోశ విశేషవాగ్ధోరణీ
మాధురీగరిమఁ దన్మయతఁ దొసరె
నాలాయిర ప్రబన్ధస్ఫుట శ్రీసూక్తి
సంప్రదాయార్థ విస్మయతసందె
భారత శ్రీభాగవత రామకథా
దికపురాణార్థ బోధకతఁ గనియె

గీ॥ ఇట్టులీతఁడు ముప్పది యేండ్లలోనె
పాణిఁగప్పట్టు బదరికాఫలముమాడ్కి
వివిధశాస్త్రార్థవాదన విషయములను
గనియెనాచార్య సత్కృపాకలనఁ జేసి

సీ॥ ఉభయకర్ణములందునుజ్జ్వలశ్రీగల
యొంటిరాపోగులజంటమెరయ
ముఖమునందున జనమోహనకరమైన
శుభోర్ధ్వపుండ్రంబు సొగసుతొలుక
అంసభాగమునందు నతిపాండుయజ్ఞోప
వీతసూత్రప్రభల్ వెలయుచుండ
సర్వాంగములయందుఁ జందనాగరుదివ్య
కస్తూరికాలేప కలనమెరయ

తే॥గీ॥ బంధురానామికాంగులి స్వర్ణదర్భ
నిర్మితోర్మిక కాంతుల నీనుచుండఁ
జూచువారల కంటికి శోభగలుగఁ
జేయునావైష్ణవాన్వయశేఖరుండు. 25

సీ॥ మూర్తియా ! పురుషుల మోహపెట్టఁగఁజాలు
భవ్యసౌందర్యవిభ్రాజితంబు
పాండిత్యమా ! మహాపండితశాస్త్రార్థ
వాదనసిద్ధాంతపక్షకరము
కవనమా ! తొరగకంఠనిరంతరో
పాసనాప్రౌఢిసంప్రాపితంబు
వంశమా ! శ్రీవైష్ణవ ప్రసిద్ధోత్తమ
విద్యాసదననామ విలసితంబు

తే॥గీ॥ ధనముధాన్యము ధేను బృందములు పాడి
పంటమొదలైన భాగ్యముల్ పరిఢవిల్ల
సన్ని వేశలసనుకూలయైనసతిని
గూడిగార్హస్థ్యధర్మమున్ గొలుచుచుండె. 26

గీ॥ అసలు మురళీధరాచార్యులనెడు పేరు
పిన్న పెద్దలు మురళిగా బిలుచుచుండ్రు
అరయ మురళీధరాచార్యులనుటకంటె
మురళి మురళీధరుండన ముద్దుగాదె. 27

గీ॥ గీతనుపదేశమునుజేసి కీర్తిగన్న
శౌరికాచార్యుడనియెడు పేరులేదె ?
కనుక మురళీధరాచార్యులనుటయందు
సంశయింపంగబనిలేదు సరసులార ! 28

చ॥ ప్రపరుడుగూడ బూర్వమొకపాటునస్వర్గపథూటిహాహతా
ప్రపసుచిమాచుకాహతిని బంకిలుడయ్యెనుగాని యీమహా
పవి కంటువంటి యోగమెటగన్నడ దట్టి మహానుభావుడీ
యుపనిజనించుటన్న జననాంతరమం దిత దేమిచేసెనో. 29

చ॥ ప్రతిదినమందు నాతడు దివాకరసారథి రాకమున్నె ని
ర్గతరుచితారకల్గ గన రంగమునందుజెలంగునప్పుడా
యుతమలయానిలాంకుర విహారచలద్భహుకాక్షిణభంగ సం
హతితతిజాయమాననినదార్భటి మేల్కొను సంభ్రమంబునన్.

ఉ॥ లేచి పవిత్రకార్ష్ణలహరీచల దంబుకణప్రశాంతక
ర్మోచితవాతపోతకలనోన్నతసౌఖ్యముచేత విస్ఫుట
ల్లోచనముఁ బ్రముదై క్షణముతోరపుభక్తి మనంబునందు ధీ
గోచరుఁడైన నందసుతుఁ గొల్చి పదంపడి శిష్యయుక్తుఁడై. 31

సీ॥ ప్రాచీనశోభావిభాస్వర కృష్ణాన
దీప్రవాహమునందుఁ దీర్థమాడి
పార్వణేందుప్రభా పాండురద్వాదశ
కమోర్ధ్వపుండ్రరేఖలను దాల్చి
మత్తభాస్కరశత్రు మందేహనాశకృ
త్సంధ్యాదికర్మ నిష్ఠలనొనర్చి
స్వాయ దష్టాదశాధ్యాయ గీతాశాస్త్ర
పారాయణాసక్తి పరతనుండి

గీ॥ ఆశ్రయించిన శిష్యుల కమితదయను
భాష్యభగవద్విషయముల పాఠములను
దర్కపాణినీయాది శాస్త్రములఁ జెప్పి
కల్యశేషము నీరీతిఁ గడుపునతఁడు. 33

ఉ॥ తాండవకృష్ణమూర్తి కులదైవతపాటను భక్తిభావనో
ద్దండతఁ గొంతకాలమవధానితపూజ నొనర్చి తీక్ష్ణమా
ర్తాండకరాతపాతముల ధాటికి సోలుచు ద్వారసీమయం
దుంటును తోడసాపడఁగ నుత్తమభాగవతోత్తమాప్తుఁడై. 34

సీ॥ కరతలామలకంబు కరణిఁదత్త్వజ్ఞాన
మందిన శ్రీయాము నార్యుఁడేమొ?
అల బ్రహ్మశ్రీసూత్రమునకు భాష్యమువ్రాసి
ప్రథగాన్న యతిసార్వభౌముఁడేమొ?
షట్శాస్త్రవిషయకసారజ్ఞుడై కవి
శ్రీఁగల్గు శ్రీవత్సచిహ్నుఁడేమొ
రంగరాజకటాక్ష లబ్ధవిద్యాస్ఫూర్తిఁ
జెలువొందు శ్రీవిష్ణుచిత్తుఁడేమొ

గీ॥ అనుచుఁ దర్కింతురతఁడు మహోరుధార
గలుగు వాచాప్రచార శ్రీకౌశలమున
వివిధశాస్త్రార్థ సిద్ధాంత విషయములను
జెప్పువేళలనచ్చోటఁ జేరుబుధులు. 35

గీ॥ అమ్మహాత్మువి సతిని రాధమ్మయంద్రు
ప్రియమిరువదిరెండు సంవత్సరములు
పుడమిమూర్తిభవించిన పుణ్యరాశి
భర్తనోచిననోములు పంటయామె. 36

గీ॥ పుటమువేసిన బంగారు బొమ్మపగిది
బహుతపంబునఁ బడసిన ఫలముమాడ్కిఁ
బుడమిఁగన్పట్టురత్నాలమూటవోలె
నరయఁ జెలువారు మురళి యర్ధాంగిరాధ. 37

గీ॥ అంత మొలిచెను పర్వపుఁజందమామ
ఁగూడ మోమును సాటిగాఁబోదటన్నఁ
కర్ణములదాక వ్యాపించి కాంతులీను
కన్నుఁగవకేమి సామ్యంబు కలదు జగతి. 39

గీ॥ భర్త మురళీధరుండు తద్భార్యరాధ
నందపురికాపురంబు కృష్ణయును దాపు
ఈసమావేశముంజూడ బృందనున్న
వారికాకృష్ణులన్న విభ్రాంతిగలుగు. 40

ఉ॥ అంతటవారలిర్వురు హృదంతరమందును నెట్టికల్మషం
బింతయు లేక సౌఖ్యమునసీగతినుండఁగ నొక్కపుత్రికా
సంతతిగల్గె నాతనయ చక్కఁదనంబిదమిత్థమంచు సి
ద్ధాంతముఁజేసి చెప్పఁగ బదంబులు చాలవు వాఙ్మయంబునన్.

ఉ॥ ఆరయనెంతచూచిన నహోయనిపించెడు ముద్దుమోము పా
ల్గారెడు లేఁతచెక్కులు తిలప్రసవంబననొప్పు నాసవి
స్ఫారిసతమ్మిరేకులన నందముఁజిందెడు కన్నుఁదోయి బం
గారపువన్నె మేనురుచి గల్గి క్రమంబుగ సప్తవర్షయై. 42

గీ॥ పరిణయోచితయయ్యె నీ బాలగాధ
యంతయును దుతీయోల్లాసమందుఁ బిదప
వ్రాయఁబోయెదఁగావునఁ బ్రస్తుతంబు
తద్విశేషము వివరింపఁదలఁపనైతి. 43

# మురళీధర విలాసము.

## ద్వితీయోల్లాసము.

కం॥ శ్రీమద్వాక్య ప్రతిష్ఠిత
ధామా! విద్యాభిరామ! ధర్మారామా!
భూమీదైవత రవితా
సీమాంతద్వాదవాగ్విశేషోద్ధామా!

ఉ॥ మార్గశిరోఽభిధానమగు మాసముదాయఁగ వచ్చెనంత నే
మార్గమునందుఁ జూచినఁ బిమాషగ సస్యపులక్ష్మి స్వప్రభా
సర్గశిర స్ఫురాటియుత నాట్యమునల్పుచునుండె ధాప్రదా
వర్గము సంతసించెఁ బటవస్త్రము దెంచెను పౌష్యమాసమున్. 2

చ॥ పొలమునఁ గోఁతవెట్టెదలఁ బూర్తినిఁ జేసి క్రమక్రమంబు చె
ప్పుల నొకచోనమర్చి బిలిబాధను మార్చఁగ నంతయుంవ "రా
శిలు" కొఱకై "జవాసు" గృహసీమ" లగాలగి" చేయ భీతి నే
డలు తడినేల కళ్ళముల వత్తరవిత్తరజేసిరాయెడన్. 3

చ॥ పొలమునఁనప్పుడే జనుపమొల్కలు కొంచెము పైకిలేచె బొ
బ్బలివరెవచ్చి హోమిపలి మూతులు చేయలు హాళ్ళద్రేళ్ళ బ్ర

ద్దలుగ నొసర్చెఁగొందఱకు దానికిఁదోడు తుషారసార ప
గ్గలమయి వేపుచుండె రవికాంతికిఁ దీక్ష్ణతతగ్గ నాయెడన్. 4

గీ॥ వరధనూరాశి సూర్యుండు వరలియుంట
"మార్గశీ" వ్రతంబు ప్రారంభమహిమసంచె
అతిశయించెను చలిబాధ కాగలేక
ధనువుపోలిక వంగిరి మనుజులెల్ల. 5

సీ॥ సతతప్రవర్ధిమా సారశీకరసమా
సంగజ దీకృత సస్యలక్ష్మి
సస్యలక్ష్మి సమీక్షాప్రమోదప్రౌఢి
పరవశస్వాంత భూస్వామిగణము
భూస్వామిగణపేర్మి పూర్వకార్పితధాన్య
సంపత్తితుష్ట యాచకజనంబు
తుష్టయాచక జనాదోష మోదాలాప
కలనాహతస్వక క్షమగరిమ

గీ॥ గలుగు శ్రీపౌష్యమాస సంక్రాంతిలక్ష్మి
ప్రతిగృహంబున వేంచేసి వరలియుండఁ
దాడిపంటలు మొదలైన భాగ్యములకు
సరయనేలాటి కొఱఁతలేదయ్యె ధరణి. 6

ఉ॥ బాలమయూఖమాలిరుచి భాసిలు గుమ్మడిపూలు పొటల
శ్రీలనుఁ దావలంబులయి చెన్నువహించెను బంతిపూలు వా

చాలపువద్విరేఫపు సంహతిఁగుల్కుగులాబిచెట్లు తేఁ
బూపు మనోహరంబులయి ముగ్ధులఁజేసె సమస్తజీవులన్. 7

ఉ॥ వేకువజామునందుఁ గడు వేడుకమేల్కొని బాలికల్హిమా
నీకలనాసహార్ద్ర కమనీయశిరోగళబద్ధరాంకవ
శ్రీకడుఁగుల్కుచుండఁ బసు చేలసుబూచిన బంతిపూల శో
భాకరమైన గేహముల ప్రాంగణమందునసుంచి రత్తఱిన్. 8

ఉ॥ గుమ్మడిపూలుదెచ్చి మఱికొందఱుబాలికలావుపేడ గొ
బ్బెమ్మలు చేసిదండములుపెట్టి చిత్రములైనముగ్గులం
దిమ్ముగఁబెట్టి వానిపయిఁ దక్కుసుమంబులఁగ్రుచ్చి స్వీయగే
హమ్ములముందు భాగమునసద్భుతవై ఖరిసుంచి రయ్యెడన్. 9

ఉ॥ స్నానముచేసెనో చలికి సంశయమొందుచు మానెనో! హిమా
ధీనము కాలమౌటఁగడుఁ దెల్లని పుండ్రముదిద్ది యొక్కసా
తాని శిరఃప్రదేశమునఁ దక్కులనీనెడు రాగిపాత్రతో
నానిగమాంతవిస్తుతుల హాయిగఁబాడుచు వచ్చెవీధిన్. 10

సీ॥ పరిపక్వసూర్యాక్ష బంతులఁబోలెడు
కర్షకార్భకులతే గాలిపాట
దంబురబుజముపైఁదాల్చి వీధులయందుఁ
దైతిక్కలాడు సాతానిపాట
సద్భక్తి “మార్గళి” జరుపుస్వాములయింట
హాయిగామ్రోగు సన్నాయిపాట

ద్వారసీమలరంగవల్లికల్దీర్చెను
కాంతలఁముద్దు సంక్రాంతిపాట
గీ॥ లసదుషశ్చరదనిలాంబరస్వనమునఁ
గలయుచు దిగంతములఁబ్రాఁకి గౌరవమును
గనఁగఁజేసెను బౌష్య సంక్రాంతిరమణ
బళిర! ప్రాచీన కాలశోభాసమృద్ధి. 11

మ॥ పలికెండిండిమము మధ్యలోసడల దాఁజారంబు కొటాపమం
టలతై పద్యాలు పెట్టుచుఁ బెగటునాసంపంబులోసంది కే
కలసల్లంతసనున్న వారిఁజలికాగన్ బిల్చుచున్ బుట్టుప్ర
క్కలనితంతులయమోఁగియుండిరి చలద్గాత్రాధరోష్ఠార్భటిన్. 12

శా॥ ఆసంక్రాంతిదినంబులన్ మురళి స్వీయాగారసీమన్ ఘను
ర్మాసారంభముఁ జేసె వానిదగు శ్రీమద్ద్రావిడామ్నాయ వా
చాసంగీతము భక్తితత్పరత యిష్టాగోష్ఠి శాస్త్రార్థ చ
ర్యాసౌలభ్యము వాగతీతము తదీయారాధనాత్పాటమున్. 13

చ॥ తెలతెలవాఱునప్పటికె దివ్యరలోల్లసధూర్ధ్వపుండ్ర రే
ఖలు ముఖమందుఁగల్గ సుమకల్పితమాలలు శీర్షమందు శో
భలసలరాఁగచుండ నిజవత్సమునందు సుగంధవాసన
ల్మలయుచునుండఁ దద్భవనమందు వసింతుమస్వాములందఱున్

ఉ॥ ఆయనఘాత్మునింటను నిశాంతపువేళ వినంగవచ్చు స
న్నాయిరవంబు మద్దెల ధణంధణమ్రోత ప్రపంచసూక్తి పా

రాయణ దివ్యగానములు రాజనమంగళగీతిరీతి నా
రాయణనామకీర్తన పరస్పరశాస్త్రవచోవిలాసముల్. 15

ఉ॥ పాలు సుగంధవస్తువులు దాడిముపప్పులు ద్రాక్షపండ్లు మి
ర్యాలు ఘృతంబు చక్కెరయు నాదిగఁ జేర్చిన పొంగలి ప్రసా
దాల సువాసనార్భటికిఁ దిస్మయులౌచుఁ బ్రబంధగాన గో
ష్ఠీలసమున్వయింతురు విశేషము స్వాములు తద్గృహంబునన్.

ఉ॥ శ్రీవిలసత్పవిత్రమురళీధరగేహ వినిస్సర" త్తిరు
ప్పావు" ప్రబంధదివ్యతరపాశురగాన నినాదమానిశాం
తావిరళ ప్రచారమురుదంచురవీచికలందు లీనమై
పోవును మెల్లమెల్లనెటఁబోవునొ జాడఁ దెలుంగ రెవ్వరున్. 17

ఉ॥ "నాయకునాయి"పాశురమునాటిదినంబు విశేషమౌట రా
రాయె మహోత్సవంబెవరై నను గ్రొత్తగ నందరింపఁగా
సేయెద రంచునామురళికేవిధి భావనచిత్తమందుఁ బెం
పాయెనుదర్కహేతువగు నాత్మమహాశయుఁ డూహఁజేసినన్. 18

ఉ॥ వేదవచోమునందుఁ గనువెల్గునఁ గావులకాయువేళ శీ
ర్ణాకృతి నూర్ధ్వపుండ్రము లలాటమునందున గోచరింప శో
భాకరయజ్ఞసూత్రవలయంబొక కర్ణమునందు వేల్పిల వి
ద్యాకళ మోమునందలర నామురళీధరగేహసీమలన్. 19

ఉ॥ చేరెను పాంథుఁ డొక్కరుఁడు శిష్యునిగామిక శిష్యుఁ డన్న బం
గారపుసన్నె మేనుదవిఁ గ్రాలుచునుండెను మాటలందు మా

క్ష్వేరుచు నూరుచుండెను నదేపనిఁ జూడఁగ బుద్ధిపుట్టు సా
ధారణమైన మానవుఁడితండని తోఁచఁడు వేషభాషలన్. 20

గీ॥ అరయ "నాయఘనాయి" పాశురమునాఁడె
యప్రయత్నంబుగా నట నవతరించెఁ
బెద్ద పెన్నిధి దొరికిన పేదమాడ్కి
మిగుల ముదమొందె నాగృహమేధి మదిని. 21

గీ॥ భార్యతోఁ గూడి బంగారు పళ్ళెరమునఁ
దద్గృహాగత దివ్యపాదములఁ గడిగి
స్వప్రవరఁ జెప్పి పిదప సాష్టాంగదండ
పన్నమస్కృతిఁ జేసి సప్రశ్రయముగ. 22

చ॥ అమలతరస్వభావ ! భవదాగమనంబున నేఁడు సుప్రభా
తము భవదీయ భవ్యనవిభంబునఁ బావనమయ్యె నాడు ఆ
శ్రమము విలసత్త్వదీయచరణాన్వయసంస్థితి ధన్యమయ్యె గే
హము సకలార్థసిద్ధి విమలాత్మ సమాగతిచేత నేఁ గదా ! 23

ఉ॥ స్వామి పవిత్రభావన ! భవాదృశభాగవతోత్తమాగతి
స్థేమమునం గృహస్థుల కశేషశుభంబులు సంభవించుఁగా
దే ! మహిఁ నప్రయత్నముగఁ దీర్థులరాక సమస్త తీర్థయా
త్రామహిమంబుకంటె బహుధాగణనీయము తథ్యమెన్నఁగా

ఉ॥ పాపము మీరు దీర్ఘమగు పర్యటనంబును జేసి గొప్ప స
న్తాపముఁ జెందినట్టుల గనంబడుచుంటిరి దేనిఁ గూర్చి మీ

లీపగిదిఁ బ్రయాణమొనరించుట వింటిని తల్లిదండ్రు
యయ్యా! పరితాపమొంది హృదయంబున మిక్కుటమై చలించెదే.

గీ|| అయ్యా! నాకునొక సంశయంబుగలదు
దానిఁ దీర్పఁగ మిమ్ముఁ బ్రార్థనమొనర్తు
యుష్మదాకారమును జూడనాగిని
ముఖ్యగార్హపత్య వైముఖ్యము గానిపించు. 26

ఉ|| దేహమునందు యౌవనము దీఁటుక తగ్గని యింతలోన మీ
కైహికభోగ్యవస్తువులయందు విరక్తిజనింపనేల పై
వాహికధర్మమేల విడుపఁబడె సంసృతిబంధమందు వ్యా
మోహమువీడి యాత్రలకు బోవుటయే ధరఁ బూరుషార్థమా!

గీ|| ఇట్టిదగుఁ బ్రాయమునఁ దమకీవిరక్తి
గలుగుటన్న మహాశ్చర్యకరముస్వామి!
ప్రాయమందున నెటువంటివాఁడు గూడ
విషయభోగానుభూతికి వెగటుపడునె, 28

ఉ|| ఎన్నిదినాలనుండి యిట నీవిధిఁ ద్రిమ్మరుచుంట యెందునే
మున్నది? దివ్యదేశములకున్న మహత్త్వమదేమి? సర్వవి
ద్యోన్నతలౌ మహాత్ములెటనుండిరి వారినిఁ జూచినారె వి
ద్వన్నుత! వారుమీరలు వివాదములాడిరె శాస్త్రచర్చలన్. 29

ఉ|| ధీసురశీల! యుష్మదతిపావనపాదసరోజపాంసువి
న్యాసవిశేషమబ్బిన గృహస్థులకేమి కొఱంతయుండు న

య్యా! సకలాగమార్థవిదులయ్యును యుక్తవయస్సునందు స
న్న్యాసవిధానమంట హృదయంబున నాకెనలేని బాధసూ. 30

ఉ॥ ఆరయ రూపురేఖలకుఁగందెను పాపము తైలబిందుసం
స్కారములేక వెంట్రుకలు చారుతవీడెను శ్మశ్రువల్లికా
భారము పెర్గిపోయె మృదుపాదయుగంబు కఠోరమార్గసం
చారితఁగందిపోయెఁ గసఁజాలను దేవ! భవత్తనూస్థితిన్. 31

చ॥ అరయ గృహస్థుఁడౌ జనుఁడహర్నిశమిత్రుల తల్లిఁదండ్రి సో
దరసుతదారల న్విడచి తాపసవృత్తిని దివ్యదేశసం
చరణముఁజేయవచ్చునె? విశాలకలావిషయజ్ఞ! చిత్రమీ
కరణి విరక్తినొందుటకుఁ గారణమున్ గృపసేయనేడెదన్. 32

ఉ॥ ఈసుకుమారదేహుఁ డెవఁడేటికి మిమ్ముల వెంటనంటె వా
చాసరసత్వమీక్షణవిశాలత గాత్రమృదుత్వరేఖ వి
ద్యాసరణి ప్రవేశమిదియంతయుఁజూడగ వింతగొల్పు ది
క్షామఁడనే మహాత్మ! తమసంగతినెల్ల ననుగ్రహింతురే. 33

గీ॥ అనుచుఁ గరములుమోడ్చి గృహవ్రతుండు
పలుక నభ్యాగతుండు వ్యాకులతఁజెంది
దీర్ఘనిశ్వాసకలన వాతెఱ దపింప
మించిమంచివచోరీతి మారుపలికె. 34

ఉ॥ నాయన! పిన్నవాఁడవయినప్పటికైనను బుద్ధిశాలి వీ
పాల్గియమునందుఁజూడ నిటువంటి సనాతనధర్మనిష్ఠ శ్రీ

దాయకమైచెలంగు నిజధర్మమునుండి తొలంగనట్టి వా
డాయతిసౌఖ్యమొందును భయావహమౌ బరధర్మమెన్నఁగా.

ఉ॥ శ్రీరమణీప్రియుండు సరసీరుహనేత్రుఁడు చక్రపాణి పం
డాయ సరోజసంభవసుధాకరమౌళి సురేంద్రముఖ్య బృ
న్దారక సేవ్యమానచరణద్వయుఁపీరుఁడు కోటిమన్మథా
కారుఁడు ప్రోచుఁగాతఁ గలకాలము నిన్మురళీ! శుభస్థితిన్. 36

చ॥ సరసుఁడ పద్మృతప్రతిభఁజాలినవాఁడవు పండితుండ వీ
వరయఁగరానియట్టి విషయంబొకటున్నదె ? లోకమందును
స్థిరతరగాథవీనుల విసంగఁగుతూహలముండుఁగాని యో
మురళి! పదీయ దుఃఖపరిపూరితగాథ విసంగనేమియో. 37

చ॥ ఎవనిపురాజనుష్కృతము దెట్టిదో యెవ్వఁడెఱుంగజాలు నీ
యవనితలంబునందు నెవఁడైనను బ్రాగ్భవకర్మరీతి సం
భవమునుజెంది పాపశుభభావనచేత మెలంగుచుండు హా
యెవనికి నెవ్వఁడయ్యు నిజమెన్నఁగ సర్వము చిత్రమేగదా?

ఉ॥ పుట్టినవెంటనే కడకు బొట్టునసైతము గోయకుండఁ బో
ద్వెట్టుచునున్నఁగాని సుతపేరిమనుఁజూడక! నాసురుండె స
న్కట్టి! నిశీథమందున నొకానొకచోటఁ బరిత్యజించె మీ
రిట్టిదినత్యమారమని యెన్నుదురేమొ? యథార్థమేఁడీ. 39

ఉ॥ దీనదశావిపన్నులకు దేవుఁడు దిక్కనుజూపుచుండుఁ గా
దేని ప్రపంచమంతయు సదేవికనిల్వఁగ నొప్పుఁ గుక్షిసం

తాన మరణ్యాపత్తి దృషదంతరభేకము పుట్టసర్ప మం
భోనిధి మత్స్యమెట్లు లిపుడొట్టనుపూట్చునతంపు తేనిదో. 10

ఉ॥ ఆయెడఁ గొన్నినాళ్ళు తనయప్రతిపత్తిని బెద్దనైతి గా
సీ: యటనుండనాదె మనసేమియునచ్చటి పోయినాడ భ
వాప్తియుతమూర్తియైన యొక దట్టనియొద్దకు చిత్తుచుండు వి
ద్యాయుతునంతునానఁ గళలన్నిటఁ బొందితి నానవేర్పనూ. 11

ఉ॥ ధారుణిఁ జెప్పనే విధివిధానము తప్పదు తప్పదెన్నఁ దేరి
మారఁగనన్నుఁ జూచిన మహాత్ముఁడు దుర్భరసన్నిపాతరు
గ్భారముచేత బాధపడి ప్రాణములన్విడనాడె హా విరా
ధారుఁడనైతి సంతబహుధా విలపించిన లాభమున్నదే! 12

ఉ॥ ప్రాయముమూడ వింశతికిఁ బైబడియుండెను బంధువర్గ మే
మాయెను జూడరేమి గుణవన్నిరంతరుజాప్తి నేల పా
లాయె నికేమిచేయఁ దగునయ్యొ! తపాదిగ సీమిధాన నీ
యూమొడ దిగ్గులఁ బరిపాత్రముమేగితిఁ దేవసంబునన్. 13

ఉ॥ భ్రమితిని నాల్గునాళ్ళు భగవంతుని ధ్యానము సేయచుండ సం
తతము భవాంబురాశిఁ బడి తగ్గుచుమగ్గుచు లోకఁ జూడ నా
మతి వదిపిన్నదీ కుమార! తపర్ధమె పెండ్లియాడు సం
గతి గనసైతి సేవాక బికారిని నావలెనుండవచ్చునే. 14

ఉ॥ ఘటముల శాశ్వతంబులిలఁ గావున జ్ఞానముగల్గు వ్యక్తి రే
పటివిషయంబులన్నెరము భావనఁ జేయఁదలంచునే మదిన్

దిటముగ నమ్మి సంతతము దేవుని ప్రేమ్మరుచుంటి నిట్టి సం
ఘటనము నర్వజ్ఞ కాక హరిగాక మరొక్క(డు సేయ నేర్తునే?

ఉ॥ కావున దేహమందు మమకారము నాకణుమాత్రమైన లే
దో విమలస్వభావ! సుగుణోజ్జ్వలుఁడైన రథాంగపాణి సం
భావనకన్న నన్యము గుభావనలేదు సమస్తతీర్థయా
త్రావిధిఁజేసివచ్చితిని దాటెను నేటికి ద్వాదశాబ్దముల్. 46

మ॥ అరయన్నల్పదియేండ్లు నాకిపుడు డాయన్వచ్చె నానామహీ
శ్వరసంస్థానములందుఁ బండితులతో శాస్త్రార్థముల్ జేసితె
ల్లరు మెచ్చంగ సురాసురక్షుభితవారాంరాశికల్లోలభీ
కర ఘుంఘుంనినదార్భటీతులిత వాగ్ధారాప్రచారంబున౯.

గీ॥ ఈచిరంజీవి శిష్యుఁడ హీనకళల
మంచిపాండిత్య సంపదమించినాడు
ఇతనికిని నాకుఁ గొంతలబ్బెండలోన
సఖ్యమేర్పడె నదిమహాత్మ్యంబవంబు.

చ॥ ఇతఁడు తదాదినుండియును నెంతయు భక్తి భజించుచుండె సం
తతమెడఁబాయఁజాలఁ డొక దైవముపోలిక నన్నుఁజూచు నా
కతనదివానిశంబుఁగడు గాసిలుచుండె నహో! పురాజను
ష్కృత ప్రణయానుబంధమది త్రెంపగఁరానిది జీవకోటికి౯.

చ॥ జగతి దివాకరాగతికె సంతసమొందును పంకజంబు చం
ద్రగతికె మోదమొందుఁగుముదంబు నవీనపయోదమాలికా

విగళితవారికణంబులకై వేడుకఁజెందును చాతకంబరే
న్నఁగనిది యోమియేనళినినాథుఁడు దక్కనెఱుంగదెవ్వఁడున్

ఉ॥ కావున లోకమందు జనకాంతమదాత్మైక వ్యక్తినెంతో సం
భావనఁజేయుచుందు నటువంటి పరిస్థితికెప్పుడీ చిరం
జీవియె లక్ష్యభూతుఁడు స్వజీవితమందు సుగంబుఁజూడ నా
కే వినియోగపర్చె నదియేసుమి నాదు చరిత్రమంతయున్.

చ॥ అరయఁగనిప్పుడేను తుహినాద్రిని వీడి క్రమక్రమంబు ప
స్తరిపురికేగి విస్మృతిఁ గనంబడు సుత్తరదివ్యదేశసం
చరణమొనర్చుచున్ విధివశంబున నిచ్చటఁజేరినాఁడ నో
మురళి! భవత్సపర్యలకు మోదమునందితి దైవసాక్షిగా. 52

ఉ॥ అంతటనాగృహస్థుఁ దమితాదరణంబునఁ గొంతవాని వృ
త్తాంతము నాత్మమెచ్చుచు మహాశయ! సర్వవిశేషశాస్త్ర సి
ద్ధాంతమెఱుంగు మీకొరులు ధర్మముఁజెప్పెడివారె గాని నా
స్వాంతము చెప్పుమంచుఁ ద్వరసల్పఁగఁ జెప్పకతప్పడయ్యెఁగా

ఉ॥ స్వామి! గృహస్థధర్మమె ప్రశస్తమటంచు వచించుచుందు వి
ద్యామహనీయులైన తమయంతటిపెద్దలు తద్విధంబుఁగా
దా మొనరింపకున్న నిది ధర్మమె? కాని వివాహదీక్షఁ గై
కోమిము వేఁడుచుంటి నొనగూడిననేను చరింతునెంతయున్.
గీ॥ వనకపల్లి సమాఖ్యచేఁ గ్రాలుచున్న
నాపుమాత్రైను మీకర్పణంబుఁ జేయ.

దలచితిని కీనికన్యధాత్వంబులేదు
లెంపు నాజన్మమెట్టు దరించునింక. 55

గీ॥ పేర్మిమ "సధ్యాగతస్స్వయం విష్ణు" వనెడి
భక్తి నారాధనముఁ జేయవలదె స్వామి
అరియమీరలు సంతసమందిరేని
సకలశుభములు నద్దాన జరుగుమాకు. 56

ఉ॥ కాన మహాత్మ! లోకమున గౌరవకారణమైన కన్యకా
దానముకంటె వేరొకవిధంబగు దానములేదు మీరు వి
ద్యానిధులచ్ఛవర్తనులు దాసుని భాగ్యమహో! కుమారి; ప్రా
చీనపు జన్మకాలమునఁ జేసినపుణ్యమదెంతదోగదా! 57

ఉ॥ మీరలుసంశయింపకుఁ డమేయము మీప్రతిభావిశేష సం
భారము నాతనూభవ భవాదృశయోగ్యవరానులబ్ధి చే
కూరిన ధన్యయో నిచటఁగూడిన భావుకయోగసిద్ధి కె
వ్వారలు సంతసింపరనివార్యముదైవవిధానమెంతయుఁ. 58

ఉ॥ బాలికపల్లెటూరు జనవాసినినోటను గల్లలన్న నే
ఏలగనుండునో తెలియలేదు సతంబు ముకుందచింతనా
లోలత సంచరించును దురూహలకచ్చటఁ దావులేదు స
చ్ఛీల! దయాత్మ! నాతనయ! స్వీకరణీయ నిజంబిదంతయుఁ.

ఉ॥ ద్వాపరమేల మీకిఁక మదాత్మజ కిప్పటి కష్టవర్షము
ల్దాపున కేగుదెంచెను గరగ్రహణోచితయోట నెద్దియుం

దోఁపక చిత్తమందున నదౌక్క విధంబుననుండ నింతలో
శ్రీపతివోలె మీరిటకుఁ జేరితిరిట్టివె దైవయోగముల్. 60

గీ॥ అన్యథా స్వామి ! మీరు మాటాడవలదు
లెండు నామాటవినుఁడు మీరేమదీయ
వరకుమారికి యోగ్యులౌ వరులటన్న
విని మహాశ్చర్య భావనా పేశుఁడగుచు. 61

ఉ॥ పక్కననవ్వి యాపరమభాగవతోత్తముకంటిమీఁదఁ బెం
పెక్కిన కూర్మినిట్లనె సహీసచరిత్ర ! వివాహమాడఁగా
మక్కువపోయి నేఁటికిరమారమి ద్వాదశవత్సరంబు లిం
కెక్కడి సౌఖ్యమిప్పుడిఁక నేమివివాహము నవ్వుఁబాటుగా. 62

ఉ॥ ఏవిధినాకు నీతనయ నీయగఁజాలుదు వాస్తిపాస్తులా
లేవు వయస్సు రూపమునరే ! యికఁజెప్పఁగనేల శైశవ
శ్రీవిలసిల్లు బిడ్డనిటుచేసిన లోఁభము నివ్విపోదె ! యో
పావనశీల ! యేటికెటువంటి శుభంబులు పిచ్చివానికిన్. 63

గీ॥ చిల్లిగవ్వైన గడకు నాచేతలేదు
తలనుదాచుట కెచ్చోటఁ దావులేదు
కుడుచుటకు వేళకింతయు గూడులేదు
యేటికొదవినపెండ్లి నాకేలసుఖము. 63

ఉ॥ కావున ; నాయనా ! సుఖముగావలెనంచెదఁ గోర్కెలేమ స
స్నివిధినుండనిమ్ము ననునేటికి రొంపినిదోర్చియఁజూతు వే

బోవిధిఁ గాలచక్రమున దొర్లెను జీవితమార్గమందుఁ గా
సీ; విధియోగమున్న నదిసేయను నాకసలభ్యమేగదా ?

గీ॥ అంతనీరీతి నందియు నందనట్లు
పలుకుచున్నట్టి నూతనాభ్యాగతునకు
మురళి ! యంజలి నొనరించి పుణ్యశీల !
విధివిధానము చెపఁడు విప్పింపఁగంటు. 66

ఉ॥ ఆరయుమీవిచూడఁగ మహాత్ములటంచును నాకుఁదోచెఁ దే
వూరెను దైవయోగ మొనఁగూడెను బుత్రికిఁ బెండ్లియంచు లో
నో ! రమణీయశీల ! ముదమొంది సుసిద్ధమునెత్తునంటి రా
ధారమణుంచు సాక్షియిది తప్పనెరుంగ మిరాక్షణాపమున్.

ఉ॥ కావున దైవనిర్ణయము గాదనఁబోవునె నాకుమాత్రె క
య్యా! పరినిర్ణయంబు పరమాత్ముఁడెచేసెనటంచుఁబోఁచె మీ
రీవిధిసేసెదేర నిరియింటికివచ్చెదనన్న వద్దు పో
పో వలదంచు గెంటు నరుపోలికఁజేయుట ధర్మమానొకో ? 68

చ॥ అదియునుగాక యొక్కవిషయంబుమహాత్మ! జగంబునందుఁగూ
డుదుఁడు పవిత్రులంబు నెదఁగోరునుగాని ధనంబునెంచఁ డి
య్యది కులహీనుఁడై తనరునట్టి త్మజాదుఁడు చేయునేమొ నా
కిది విషతుల్యమైన ధనమెప్పుడదేవిధనిల్వఁగల్గునే ? 69

గీ॥ మహితవంశంబునందు జన్మమునుజెంది
భవ్యవిద్యలచదివిన వరగృహస్థు

పరువియోగ్యతాయోగ్యతా సరణిఁ జూచి
కన్యకాదానమొసరించుఁ గాదె సామి. 70

గీ॥ బహుళ ప్రణయానుబంధ సౌభాగ్యగరిమ
నుల్లసిల్లెడు దంపతు లున్నచోట
దీనవశఁ గొల్పు దారిద్ర్యదేవి దొలఁగి
చిరము ధనధాన్యభోగభాగ్యములు వరలు. 71

ఉ॥ పరుఁడదియెంతిసౌమ్ముఁ దిగవైచినఁ బ్రేమనుఁ జూచుచున్నఁ గిం
సరణిమెలంగుచుచ్చ్యుతిసంతసమొందఁ గఁ జాలునే? సుధీ
పరివలచంద్ర! భవ్యగుణభాస్వరశీల పతివ్రతప్రియ
స్ఫురదనురాగబంధమునె చూతురుగాని ధనంబునెంతురే? 72

ఉ॥ కాన; మహాత్మ! నిశ్చయముగాఁ దమచేవిధినైనఁ గన్యకా
దానముఁ జేయనుంటి నిదితప్పదు నన్ననుగ్రహించి యి
ద్దానికి సమ్మతింప బహుధా మిము వేఁడుచునుంటి రెండుకృ
ష్ణానది దాపులోఁ గలదు స్నానముఁ జేయుడు మీరు శిష్యుఁడున్.

గీ॥ అరయ గోదావివాహపర్యంతమిచట
శిష్యుతోఁ గూడ మీరు వేంచేసియుండు
డనుచుఁ బ్రార్థింపనతఁడు మారాడకుండ
శిష్యుతోఁ గూడి కృష్ణకుఁ జేరెనంత. 74

గీ॥ వజ్రమునకంటె నొకవేళ పరుషతరము
కుసుమమునకంటె నొకవేళ కోమలంబు.

వసుధ లోకోత్తరుండై సవాని హృదయ
మెప్పుడేరీతినుండునో యెవ్వఁడెఱుఁగు. 78

ఉ॥ శ్రీవిరపాకనాటి కులశేఖర ! ధీమదనంతరెడ్డి పౌ
త్రా ! విమలామనోహరపదద్వయ సేవనలబ్ధదివ్య వి
ద్యాకర ! రాజయోగ విషయప్రతిపాదనదక్ష ! కోటిరె
డ్డీ ! కమనీయభావసుహృదింద్రసమాదృతిబద్ధకంకణా ! 76

ఇది

శ్రీ గుడిమెళ్ళ రామానుజాచార్య విరచిత
మురళీధరవిలాసంబను నిర్వచన ప్రబంధమందు
తృతీయోల్లాసము

---

# మురళీధరవిలాసము.

## తురీయోల్లాసము.

కం॥ భారత భాగవతార్థ వి
చారా! శరదిందుకాంతి సన్నిభసుయశః
పూరా! వాసక భూభృ
ద్ధీరా! శ్రీకోటిరెడ్డి! దివ్యశరీరా! 1

గీ॥ రాధికా మురళీధరప్రణయ ఫలము
శ్రీకనకపల్లి యనుపేరఁ జెలఁగుచుండుఁ
బ్రాయమెన్నఁగ నెనిమిదివత్సరములె
గాని పదియేండ్ల బాలిక కరణి నుండు. 2

గీ॥ నాలుగైదేండ్లు వచ్చిననాఁటనుండి
నందసూనుఁడటన్న నానందమొందు
ఎట్టుగలిగెను హరియందు నిట్టిప్రేమ
గతభవంబునగోపిక గానియెడల. 3

గీ॥ పూర్వజన్మంబునందున పూర్వభక్తి
నందసూనునిభర్తగా నొందఁగోరి

స్వీయదైవముకంటఁ గన్పించువఱకుఁ
తపముఁజేసిన యొకగొప్పభక్తురాలొ ?
గాక యేదైననొక శాపగరిమకతనఁ
బడసి వెలసిన రాధికామూర్తియేమొ
లేక బహువల్లభుండైన కృష్ణుమీఁద
వలగి యీరీతి జన్మమునందినట్టి
మానవతియగు సత్యభామయగునేమొ ?
అదియుఁగాదేనిఁ గృష్ణునియందుఁ దనకుఁ
గలుగు భక్తిని బ్రకటింపఁ బెంచి పుడమి
జననమొందిన రుక్మిణీ సాధ్వియేమొ
కృష్ణున ధరామృతంబున తృష్ణదీఱ
ననుభవించిన యలవాటు ననుసరించి
మగిడి పుట్టిన గోపికా మహిళయేమొ
పూర్వమే మౌనియోజన మోహనాంగుఁ
డైన శ్రీకృష్ణుఁ దండగాఁ దనుచుఁ దలఁచి
స్త్రీ స్వరూపాన సాక్షాత్కరించెనేమొ
అట్లుగాకున్న లేఁబ్రాయమందె యామె
కెట్టి ప్రణయము కృష్ణుపై నెలగలుగు. 4

గీ॥ చిదుమఁ బాల్గారు చెక్కులఁ జెలఁగుచుండు
ప్రాయమదియేద ప్రణయానుబంధమేద

సర్వమును బాదగా మహైశ్వర్యకరము
దేవుఁ డొసరించు చిత్రంబుఁ దెలియఁగలమె. 5

గీ॥ ఈవిధంబుగఁ గృష్ణునే హృదయనాథు
గాఁదలంచుచుఁ దత్స్మృతిగరిమనుండ
నింతలో సప్తవర్షము లేగదెంచెఁ
గనకవల్లికి వైవాహకళయు నొప్పె. 6

కం॥ అంతట బొమ్మల పండుగ
యింతులకెంతేనిఁ బ్రమదమేర్పడవచ్చెన్
గంతులు వైచుచు బాలిక
లంతట బొమ్మలనుబెట్టిరమితస్ఫూర్తిన్. 7

చ॥ అరయ సహోధబాలలు గృహాగతులైన నిజాత్మనాథులం
గరమనురాగసౌరభవికస్వరమానసలై తదీయ సుం
దరముఖదర్శనార్థము వృథాగమనాగమనాతిరేకవి
స్ఫురణమొనర్చుచుండిరటచూపులవారికి హాయిఁగొల్పుచున్, 8

చ॥ అరయ దినాంత సూర్యకిరణాంకురపాటల దివ్యదీప్తి సు
న్దరసయనోష్ఠనాసలయి నవ్యకలాపచలన్మణిప్రభా
పరిచితకంఠలై శ్రవణభాసురకుండల క్రమకాంతి వి
స్ఫురితకపోలలై సతులు చూడఁగనొప్పిరి సాంధ్యవేళలన్. 9

ఉ॥ శ్రీకలితంబులై సకలదృష్టిమనోలలితంబులైన లో
లాకులు కర్ణభాగములలాస్యమొనర్పఁగ వక్రకుంతలా

సీకము ఫాలమందుఁగడుసీటుగఁ గుల్కుచునుండ సాంధ్యవే
లాకమసీయ వీధులకులాసగ వత్తురు బాలికమణుల్. 10

సీ॥ విరిసిన చేమంతి విరులదండలఁగుల్కు
నవవేణిపిరుఁదుల నాట్యమాడ
లలితసాయంశోభఁ దళుకులీనెడుకుండ
లముల చంచలతగండములఁగులుక
బహు మృదుత్వముచేతవరలు పట్టుపుఁజీరె
సరిగంచులేగాలి దొరలుచుండ
బంగారు కుంకమ బరిణె కాంతులు తళ్కు
చేతుల కొకవింత చెలువుమీర

గీ॥ పసుపుఁ బూఁతలు పాదాల వరలుచుండ
నొసట కుంకుమ సొగసుల పసఁజెలంగ
రాజవీధులయందు విలాసగమన
ములను బ్రతియింటఁ బేరంటములకుఁబోవు
చుంద్రు ముగ్ధలు సాంధ్యవిస్ఫూర్తివేళ. 11

ఉ॥ ఆసమయానఁ దన్నుఁదనయయ్యగృహాతుడైన యొక్క స
న్యాసికొసంగి పెండిలి యొనర్పఁదలంచెనటంచుఁ జింతచే
గాసిలి రాధకూఁతుఁరౌరుఁగానక మెల్లన వేణుపాణి వేం
చేసిన దేవళంబునకుఁ జేరి నుతించు నుండె నీవిధిన్. 12

ఉ॥ ఫో! జగదేకమోహనకరోజ్జ్వలరూప విశాల! సత్కృపా
భ్రాజితశీల! భక్తజనపాలనలోల! దయాలవాల! మా
రాజవనాగ్నికీల! సురరాజ శిరస్తట రత్నకాంతి నీ
రాజితదివ్యపాదకమలద్యుతిలీల! నమో నమోస్తుతే! 12

ఉ॥ పుట్టిన నాటినుండి జనమోహన రూపుడవైన నిన్నుఁ జే
బట్టఁగ గోరి సంతతము భావన చేయుచునుంటి భైష్మిఁ జే
పట్టిన రీతి నన్నుఁ గృపాగరిమంబునఁ గావలేవె? న
న్నట్టడిపెట్టనేటికిదియె గౌరవమయ్యెనె; నందనందనా! 13

మ॥ నవనీతంబును జున్నుమాదిగను దిన్నన్నీకుఁ గాఠిన్య మె
ట్టి విధిన్ సంభవమయ్యె నయ్య! యిటుఁ గట్టైగాని; ప్రాణంబు నీ
సవిధంబందును నిల్పి యుండెగద కృష్ణా! నన్నుఁ జేకొమ్మ నేఁ
డెపుఁడో: తైర్థికుఁ డంట శిష్యుఁడను దా నేతెంచె మాయింటికిన్.

మ॥ చెలియిన్ మోసము గట్టమున్నెఱసెఁ జత్వారింశదబ్దంబు లే
కలసన్ జూచిన డాయవచ్చెఁ గడకున్ గావైనలేదంట హా
వెలగన్ జేసెడు కొంపలేదఁట నదే; మేనన్జరాభార దు
ష్కల జూపట్టుచునుండె నేపగిదిఁ దత్సంబంధ మెంతున్ ప్రభూ॥

ఉ॥ మాపటితోడ నాగురుని "మార్గశి" దీక్షసమాప్తమౌను తే
పే; పరిపూర్ణమోదమునఁ బెద్దప్రయత్నముఁ జేయుచుండె గో
దా పరమాత్ములిద్దరకుఁ దిప్పక పెండ్లినొనర్పనాఁడె రా
ధాపతి! నన్నుసంగసనఁట దారినిఁ బోయెడు పిచ్చివానికిన్. 16

ఉ॥ శ్రీయుతమై సమస్తజనసేవితమై శ్రితలోకమంగళా
ధాయకమై మనోహరసుధాకరబింబసమానమై శ్రుతి
ధ్యేయమునై చెలంగు భవదీయముఖంబును జూచి గోపికా
నాయక! నిన్నె నాహృదయనాథునిఁగాఁగఁ దలంచితిం జుమీ. 17

ఉ॥ పంచమఁబట్టి ప్రాణములఁ బాయుమి నేవిధినైనఁ గాని స
న్మంతిగవానికిస్మరణయంబును జేసినఁ బథ్యమిద్ది నా
గొంతును గోయునేఁ ముసలివానికి నిచ్చి గుదుర్చు దేవ! నీ
వింతటి మోసగాఁడవని యెంచఁగనైతిని నంచనంటినా! 18

ఉ॥ పాపసిలీ! పూర్వమొక బ్రాహ్మణపర్యుఁడు చెప్పినట్టి పై
ష్ణ్రవచనప్రసంగమున మిక్కిలి సంతసమొంది వెంటనే
దేవిగ బొంగిలించితివదేవిధమిప్పుడుగాక నేస్వయం
భావనఁ జేయుచుంటి నను భార్యగఁ జేకొనవేమిహేతువో! 19

ఉ॥ వెంటను వచ్చు బిడ్డగనుపింపకరాధికవంతఁగుంది పే
రంటముచేగెనోయని పురంబున నెల్లెడఁజూచి చూచిపోఁ
గంటను నీరువెట్టుచునెకామెకి కృష్ణునియొద్దకేగి త
న్మంటపసీమనిల్వఁగఁ గనంబడె పుత్రిక ధ్యానమగ్నమై. 20

గీ॥ ఈవిధంబుగఁ గృష్ణుని యెదుటనిలచి
ధ్యాన మొనరించు పుత్రిక నరసి రాధ
పటమునను వ్రాయబడినట్టి ప్రతిమమాడ్కి
క్షణము కదలక నట్టె నిశ్చలతనుండె. 21

ఉ॥ అత్తరి నేదియో యొక మహాపరిణామము చిత్తమందు రే
కెత్తఁగఁ గొంతసేపటికి కూఁతురు దాపునకేఁగి మెల్లఁబై
కెత్తి కవుంగిలించి ముఖమెత్తికనుంగవనీరు కొంగుతో
నొత్తి శిరంబుమీఁద ముదమొప్పఁగ ముద్దిడి చేసియిట్లనెన్.

ఉ॥ భాసుర రూపుఁడైన భగవంతుని పాదములందు నీమనో
న్యాసము గల్గినట్టు చెవులారఁగ వింటిని తల్లి! నాకు సం
తోసము గల్గె నెటుఁ గడు నూతనప్రాయమునందె యీదృశా
భ్యాసమదెట్టు గల్గె నిటువంటిది మౌనులకైనఁ గల్గెనే! 23

ఉ॥ కావున నీవు లోకమునఁ గ్రమచరిత్రపు దేవునిట్టు సం
భావనఁ జేయుమానసము పొల్పడునాకా తదీయ దివ్యసు
శ్రీవిలసిల్లుమూర్తికి ప్రసరింపకయుంటినిఁ గాన తల్లి నీ
భావనమోలిమున్ననను నక్షరవు లెమ్మిక తత్త్వమెన్నఁగా! 24

ఉ॥ మానసమందు నీవు పతిమాదికిఁ గృష్ణునిఁ గోరినట్టు నా
కైనను చెప్పకుండ హృదయంబున దాఁచితి విన్నవాళ్ళ నేఁ
డేని నెఱుంగనా? యిపుడిక్కడకే నడచెంచకున్న నిన్
దానముఁ జేయఁబూనెగద తండ్రి యొకానొక పుణ్యమూర్తికిన్.

చ॥ అదియునుగాక తల్లి పరమాత్ముఁడుగూడ మనుష్యరూపసం
పదనుదెలంగి భక్తజనవాంఛితమున్నెఱవేర్చుచుండు నే
నిది గనుగొన్న నేఁడు హరియేయిటు వచ్చినవాఁడటంచు నా
హృదయము చెప్పుచుండెఁ గరమెన్నఁగ నియ్యదిసత్యమేసుమీ,

ఉ॥ ఆరయఁ దండ్రిమాటకెదురాడఁగఁ గూడదుగాన తెమ్ము సా
ధారణమానవుండ యనఁ దద్విధినుండుమనె. యమ్మహాత్ముఁ డ
ప్పొమ్మ! రమణీయవేషమును మాటొనరించి బికారిమూర్తి రా
ధారమునుండె వచ్చెనని తద్దఁదలంపుము నీటు మేలగున్. 37

కం॥ అనియీవిధమునఁ బలికిన
జననికి దుఃఖంబు సంతసంబును దానా
ననమునఁ దోపఁగ మెల్లనఁ
జనియె నచటనుండి మాతృసహితఁగ సంతన్. 38

ఉ॥ అంతట వారలిద్దరు మహాత్ముఁడు కృష్ణుని మందిరాంతర
ప్రాంతమునుండి వెల్పలికి వచ్చినతోడనె పూర్వభావసం
బంతయు భ్రంశమయ్యెఁ బరమాత్ముఁడు తద్విధిఁ జేసెనేమొ వా
రంతట నింటికేగి యట నారయ నీగతినుండె వింతగా. 39

ఉ॥ వచ్చిన తైర్థికుండు గృహభర్తకు నీవిధిఁ జెప్పుచుండె నో
సచ్చరితా! స్వభావమున సాధువు నాప్రియ శిష్యుఁ డన్న న
స్వచ్ఛపు భక్తిమీఱఁగ నహర్నిశము న్భజియించుచుండె నే
వెచ్చటనైన నొక్కసుతనీతనికిన్ముడివెట్టఁ జూడుమా! 40

ఉ॥ ప్రాయముచూడ నిర్వదికిఁ బైఁబడియుండదు చూచువారి కా
ప్యాయనకారిపీనిలసదాకృతి తర్కము పాణినీయమా
హాయనునట్లు పాఠముల నద్భుతరీతి పఠింప గల్గు న
య్యా! యిటువంటివానిని గృహస్థునిఁ జేయుట ధర్మమేగదా!

ఉ॥ తల్లియుఁ దండ్రియుం గురువు దైవమునేనని నమ్మి భక్తిరా
జిల్లఁగ దివ్యదేశపరిశీలనఁ జేసెడు వేళలందు నా
యుల్లము సంతసింప శ్రమకోర్చి మహోత్తమ సేవజేసె నా
వల్లనదొక్క సౌఖ్యమును పాపమెఱుంగఁడితండు నేఁటికిన్. 42

ఉ॥ కావున నీవునెట్టి శ్రమకైనను నోర్చి భ్రమించి యీవిరం
జీవికిఁగూడఁ బెండిలిని జేయుము నీసుత పెండ్లిలోనె యో
పావనశీల! యోగ్యుఁడగు పండితుఁడెవ్వఁడుఁగూడ నన్యసం
ధావన కార్యమందుఁ బలుపాట్లనుచెంది కృతార్థుఁడౌఁగదా! 43

చ॥ నలుపది యేండ్లుగల్గినను నాకెవివాహము నాకుకాంక్ష యు
జ్జ్వలతఁజెలంగుచుండ విలసన్నవయౌవనవైఖరీప్రభా
సులలితదేహుఁడై కరము శోభిలుచుండెను నిట్టివానికే
కలఁగనుగొన్నఁగాని శుభకార్యముఁజేయఁగ బుద్ధిపుట్టదే! 44

ఉ॥ ఆరయ నంతమీదట గృహస్థుఁడు తత్తదుదాహృతార్థ గం
భీరత కెంత యోజనిత విభ్రముఁడై యటఁ గొంతసేపు కం
సారివిలాసమా? యిదియటంచు మనంబునఁజింతసేసి జో
హారులొనర్చి మెల్లనిటులాదరమొప్పఁగఁ బల్కెవానితోన్. 45

ఉ॥ స్వామి! మహానుభావ! తమవైఖరిఁజూడఁగ రానురాను రా
ధామురళీధరద్వయమె తప్పదుమీరలటంచు నామన
స్సీమఁ జెలంగుచుండె నొకచిత్రఁపు గోర్కె యదార్థమౌనొ కా
దో? మరిచెప్పలేను మదిదోఁచదు నాకిది యేమిటైనదిన్. 44

ఉ॥ పుట్టినవెంటనేఁ దకు బొడ్డును నైతము కోయకుండఁ బో
ర్వెట్టుచునున్నఁగాని సుతప్రేమను జూడకనారయుండె స
స్కట్టు నిశీధమందున నాకానాకబోటఁ ద్యజించెనంటిరీ
పట్టు సమీక్షసేయ భగవంతుఁడవీవని నొక్కిచెప్పదే? 47

ఉ॥ గోకులబృందలోనఁ దిమకుంగనులంబడె సీతఁడంటి ర
య్యా! కమలాక్షి రాధికయునయ్యదియేగడవాసిఘామి; మా
ర్వైకసమాసవాణియు నదేమనిఁ జూడఁగ బుద్ధిపుట్టు క
ప్రాకృతిసౌకుమార్యమిదియన్నియుఁ జెప్పవెశిష్టతత్త్వము—

ఉ॥ జాలముసేయనేల తమసంగతిఁ జూడఁగఁ జిత్రమయ్యె మీ
లీల నెఱుంగలేనిపుడు రేయొకజాము గతించె రేపుషః
కాలమునందె లగ్నమటుగాపున తచ్ఛుభవేళ శ్రీమదా
ండాళు వివాహముజరుగునాటిదినంబు పవిత్రమాటచే. 49

శా॥ ఆగోదాసతిపెండ్లిలోఁ దిమకుఁ గన్యాదానముంజేయ హ్యా
ద్భాగంబందుననెంచి సేవలయు సంభారంబులన్నాడ దే
వా! గైకొంటిని యోగ్యలగ్నమిది డాయన్వచ్చె మీకోర్కె నా
న్నాగణ్యేటక్కిన మూఁడుజాములకులోసంగాదె యత్నింపనా. 50

ఉ॥ హౌస మహాత్మ! శిష్యునకుఁగావలెనాసుతపెండ్లిలోనె క
ల్యాణమటంటిరందుకొఱకయత్నము సేయఁగ నూహపుట్టె నే
నీనిశి మాపురంబునను నించుకదూరమునందునున్న కృ
ష్ణానది దాటనావలగనంబడు పల్లెకుఁబోయి వచ్చెదన్. 51

చ॥ అదియొకపల్లె కార్ష్ణఝురినానియెయున్నది దానియందు సం
పదఁదులఁదూగుచున్న యొక వైష్ణవశేఖరుఁడుండె నాగుణా
స్పుటునకు సేవంగ నొకప్రాణమతంటుసు మాకులంబునం
దుదయముఁ బొందెవానికడనుండెను పుత్రిక లక్ష్మి పేరునన్. 52

ఉ॥ అతఁడు సమీపదేశ ప్రసవహర్త్ష్ఘరమందునఁ గంఠదఘ్న సం
స్థితిని వహించి ప్రత్యహము శ్రీతురగాననమంత్రరాజము
న్నితతమనోవ్యథీకృతిని వేలకువేలు జపించుచుండు కా
మిత ఫలసిద్ధిదాక నట మిక్కిలిదీక్షఁ దెలుంగు నెంతయున్. 53

ఉ॥ కావుననాకనుజ్ఞ నొసగన్ మిము వేఁడుచునుంటి యుష్మదా
జ్ఞావిధపుష్పమట్టు శిరసావహనీయము మాకుఁ గాననే
నేవిధినైన నాతనిని నీవిషయంబున నొప్పఁగాఁ జేయఁగా
బోవుచునుంటి భవ్యగుణభూషణ వెంటనె వత్తుఁ గ్రమ్మరన్.

చ॥ అనియతని న్పదంబులంటి యమ్మహనీయ మహోత్తమాశిషం
బును గొని నేనకాంతముగఁ బోవుచునుంటినటంచు నీవు నె
మ్మనమునఁ జింతనొందక కుమారియు నీవును గూడ నీమహా
త్మని పరిచర్యచేసి కడుతుష్టునిఁ జేయుమటంచు భార్యకున్. 55

గీ॥ నుడివి కృష్ణాభిముఖముగా నడువఁ దొడఁగె
నర్ధరాత్రిన నొంటమై నాగృహస్థు
పుడమి మాత్రము పిండారఁ బోసినట్లు
పండువెన్నెలతోడఁ దానిండియుండె. 56

# మురళీధరవిలాసము.

## పంచమోల్లాసము.

కం॥ శ్రీ వేదాంతవచశ్శ్రీ
సేవా విమలాంతరంగ! సేవితరంగా
ధావకసంగ! మనోహర
భావమహోత్తుంగ కీర్తిధాసురరెడ్డీ. 1

ఉ॥ ఆరయుమంతమీదట గృహస్థశిరోమణి! శీతచంద్రికా
సారమనోజ్ఞకార్ష్ణతట సన్నిధికేగిన సట్టివేళ స
చ్చో; రమణీమణీవిరహశూలనిఘాత కృశాంగుఁడౌచు సం
సారమునందుఁ దీరని విషాదముగల్గు వియోగియొక్కడీ
తీరున దుఃఖమొందుచుఁ దదేకమనస్కుతఁ బర్యటించుచున్.

ఉ॥ ఎక్కడికేగువాఁడహృదయేశ్వరి! యింకను నీవునాకుఁజే
జిక్కుదువంచునాసమదిఁ జేయుటవ్యర్థము కార్ణ్ష్యపూరమే
చిక్కక నాకుఁ బ్రాణములధీరతఁబాయుట పాపహేతువే
యిక్కడ నీవులేక వసియింపగఁజాలను ప్రాణధారినై. 3

ఉ॥ ఏయెడఁ గూరుచున్న హృదయేశ్వరి! జ్ఞప్తికివచ్చెదేటి క
ష్టా యిక నీవియోగభరబాధ భరింపఁగఁజాల నోయి! చం

దాఁ! యిటులున్న దేమయ! హిమార్ద్రితనుండెడు నీదుమేను త
ప్తాయసపిండమట్లు విరహవ్యథలీగతి ముద్దగట్టెనే. 4

ఉ॥ కూర్రవిధుంతుదోగ్రరదకోటి సమాహతిచేతఁగాని తా
రారమణీ నిమిత్త రణరంగమునందునఁగాని యక్కరో
గోరు భరాప్తిఁగాని ప్రవియోగవతీజన దత్తశాపవా
క్యారతఁగాని చాపవిది చోద్యము పాపి చిరాయువాటనా!

చ॥ అరయ శ్మశానమందుఁదిరుగాడెడు భిక్షువు బ్రహ్మహంత ని
స్సరమునఁ దాల్చెనంటి విడిచెల్లును మీఁద సమస్త జంతు సం
హరణమె నైజవృత్తి భుజగాదృతిఁగాంతురు దుర్విషంబు ని
ర్భరు వెసదాల్చినారు సరిపోయెను మీసహవాసమెంతయుఁ. 6

చ॥ మలయసమీర! నీకొకనమస్కృతిఁజేయుదు మళ్ళిపొమ్ము శీ
తలగతినుండు నీవిపుడు దావవిధంబననుంటివేల హా!
తెలిసెను; చందనద్రుమవనదేశ చరత్ఫణిరాజపుత్రికా యా
నిలయ మహాభయంకరకునిశ్వసనానిలమేళనంబెగా. 7

ఉ॥ కాండము పుష్పమేయగునుగాని రతీశ్వర! తప్తలోహ దు
ష్కాండముకంటె మిక్కిలి దపింపఁగజేయు వియోగి కోటినీ
కాండము కాలిపోను ననుఁగాల్చుకతిందువదేటికయ్య! బ్ర
హ్మాండములఁ హరించు హరుఁడై నను నిన్మసిఁజేయకుండెనే

చ॥ అతనుఁడవై శివామె హరుఁడైనను నిఁగదలింపలేఁడు నీ
కతన వియోగులెందఱు యకాలమృతింగనినారు పాపమీ

హతికలుషంబు నిన్ను హతమార్పదె యెన్నఁటికైనఁగాని నే
సతి నొనరింతుబాణమును నాపయినెక్కుడుఁబెట్టఁబోకుమా. 10

ఉ॥ సరసిజ ! నాసతీతనయన సామ్యమునందిన నీపుగూడ నా
ఖరకుచకరంబులో మునిఁగి కన్పడ వెక్కడికేఁగవాఁడ నే
విరణి సతంబుఁ జిత్తమునుగాల్చుచునుండెడు నీమరందిడు
ద్విరహదవానలంబును భరింపఁగఁజాలుడుఁ బ్రాణధారినై. 11

ఉ॥ ఓయి ! రసాల ! యీసరణినుందుగదా ! యెపుడైనఁగాని నా
ప్రేయసి యిట్లువచ్చెనె ? శిరీషసుమస్పృహణీయ దేహమా
హాయనిపించు ముద్దుమొగమందముఁజిందెడు పన్నుదోయిగాం
పేయపు సోయగంబు మఱపించెడు చక్కనినాసయూ మెకుఁగా.

గీ॥ ఓయి ! తాపింఛమా ! వినుమొక్కమాట
వేఁదమలపాకువంటి శరీరమందు
యౌవనభరంబు దోఁణికెసలాడుచున్న
పదునెనిమిదేండ్ల ప్రాయంపుఁ బడుచుపిల్ల
కంటికెపుడైన నీవారిఁగానఁబడెనె. 12

ఉ॥ ఘనకుచకుంభభారమునఁగా నొకయించుకవంగియుంతు మె
ల్లనడయాడునప్డు కరిరాజగతిన్మరపించుచుంటు న
న్ననిగళనాదమై ఖరి స్వనత్సికజాతిని వెక్కిరించునే
మనుదువుచూచినావె! కలహంసమ! చెప్పు మెనర్తునంజలిన్.

చ॥ మిసమిసలారు బుగ్గలను మృగ్యము సామ్యము కోమలప్రభా
విసరముచే వెలుంగు ముఖబింబము చంద్రునిఁబోలియుండు నె
న్నొసటి మృగీమదం బెపుడు నూత్నసువాసనఁ జిమ్ముచుండు నీ
కసలు మనస్సు రేచెడుతలంపైన నెఱుంగవె నాసతీమణిన్. 14

ఉ॥ ఓ కలహంస ! నీకుసత్కృతియుంతును నాప్రియురాలిపెట్టు ను
ద్ధీకరియానచాతురి నెఱింగిన మాతుపుచే నొకప్పు డా
నైకితనీవు నిప్పు డతిసన్నిధి నేమి వచింపుచుండ రా
న్నాకమనీయహంసరుచితంబని వచ్చితి జ్ఞప్తియున్నదే ? 15

ఉ॥ ఔను యదార్థమో యుపికమా ! గళనాదములందు నిన్నురా
నౌను సమానచేయఁగఁదురామె వసంతవేళ కవీంద్ర ! నీ
వేను రసాలపల్లవము తేరి సమర్పణముం బొనర్తు నీ
వైనను జెప్పవయ్యొ విరహార్తుఁడ నాప్రియురాలి జాడలన్. 16

మ॥ శుకమా ! నాసతిముద్దు నిన్ను వచనస్ఫూర్తి స్పదంబించె ఝా
పకమున్నే యపుడీవు కోపమున భాస్వత్పాటలతోటి వై
పికముల్ సాయముపిల్చు నేఁడటు దనీవేళా పృథావాదనం
బుకుఁ గాల్దుప్పు దుపక్కడా జయము పోపోయంచు గెంటించవే

ఉ॥ ఇంకను తత్పరాభవ మెంచుచు కోపరసోరుదృష్టి నా
పంకకుజూచె దేమిటికి పల్దికరత్కృథఁగాని మిత్రమా !
పంకజనేత్ర నీ వెఱుఁగవా ! దయచేసి యొతింగియున్న ని
శ్శంకత జెప్పు మికొసఁగఁ జక్కని దాడిమిపండు తెచ్చితిన్. 18

ఉ॥ ఒక్కొకకన్ను చేరెడుగనుండి విభీతభవత్ప్రియాచల
ద్దృక్కులమాడ్కిఁ జంచలపుశ్రీఁ జెలువారుచునుండు నింకఁదా
బిక్కనవ్వినప్డు రదపంక్తి సుమాంకురమట్లు దోఁచు నీ
వెక్కడనైన నిట్టి సతినీక్షయొనర్చితివే కురంగమా!

ఉ॥ ఏమని; చక్రవాకి వచియించెదవార్తిచెలంగఁ బాపమా
నే మరి దుఃఖమొందెదవు నీవలెనేనును దుర్వియోగ బా
ధామహితార్తిపీడితుఁడవానికి నిర్వ్వరమేమొ సర్తు మె
ట్లో మరునాఁడు నీవుసుఖమొందెద వేగతినాకుఁ జెప్పుమా. 20॥

ఉ॥ ఈవిధి ముక్తకంఠతసహీన ప్రియావిరహార్తిచేతఁ గృ
ష్ణావిమలాపగాతటి విచారముసందెడు వానిఁ జూచి రా
ధావరుఁడంతమీద నిహతక్రముఁడై క్షణకాలమట్టె సం
భావనఁ జేసి మెల్లనిటు పల్కె వియోగికి నోమహాశయా! 21

ఉ॥ ఏటికి? పాపమిట్లు తపియించెద పూరటనొందుమింక పృ
థ్వాటనమేల చేయుదుకటా! కరుగున్గద రాయిగూడ హృ
త్పాటనఁ జేయు నీవిరహభారసముద్భవశోకగీతికా
ధాటికినేతదర్థమెగదయ్య మునుల్ భవమున్ త్యజించుటల్. 22

ఉ॥ ఈనడిరేయి; నిచ్చటికి నేగతివచ్చితి వెట్టివాడ కృ
ష్ణానది చూతవృక్షములొసంగునె నీప్రియురాలిజాడ య
ట్లైని ప్రపంచమంతయు నిఁకేటికి రమ్మట గూడుచుందమ
య్యా! నిజమెన్న మీసుఖములన్నియు మీసవుఁ దేనెలేగదా! 23

చ॥ అరయ వివేకశాలి భవమందు సరోరుహపత్రవారి వై
ఖరిని జరించుఁగాని యిటుగా మమకారముఁబెట్టుకొన్నె పా
మరుఁడవుగావు నీవు నిజమానిని నామమహర్నిశంబు నీ
వరుస జపింతువీదృశజపంబుసఁబుణ్యమ; పూరుషార్ధమా! 24

ఉ॥ ఇక్కడఁ దకేమి? మీరలసరెవ్వరలిట్టి వియోగబాధ మీ
కెక్కడనుండివచ్చె వచియింతురె సర్వము మీచరిత్రి మి
మ్మెక్కడా జూచినట్టు పలుకెక్కడొ పూర్వము విన్నయట్లు నా
కొక్క తలంపుగల్గె నగునో యది గాదొ మరెట్లు చెప్పుడుఁ.

ఉ॥ నాకదియేమొ? చూడగ మనంబున సంశయమొందుగల్గె న
య్యా! కనబుఱ్ఱుమిట్టు భవవాస్యమునెందునొ చూచినాను మీ
రేకద జూచిరన్న నదియే స్మృతిలేదు సరే! హృదార్తిమే
పేకనస్ఙనించె వచియింపుఁడు చూతము శాంతియత్నముఁ.

చ॥ అని మురళీధరార్యుఁడిటులాదరమొప్పఁగఁ బల్కరింప మె
ల్లన నొకనవ్వు మోమునఁ జెలంగఁగనాతఁడు పల్కెనిట్టులో
యనఘ! ప్రపంచమందునొకఁడారయనొక్కనిఁబోలియుండుఁగా
పున నసుఁజూచి యుంభుటది పోలదుపాపముభ్రాంతినందితో. 28

ఉ॥ ఏమది యట్టెచూతువది యేపని మోమునమోముపెట్టి దే
వా! మిరియూఏ గాడు రమవంటి మహాశయులిట్లు జూడ నే
నేమియుఁ దస్కరింపఁ దమయింటన నైనను నిట్టికృత్యము
ల్నామది జెప్పుదేమి యవినచ్చపు పోయెదఁ దీహాలెన్నడో 28

ఉ॥ ఇంతకుఁ జూడఁగా నెనిమిదేండ్లు రమారమి నాటనుండి నే
నెంతహృదార్తినొందితినొ! యేమియెఱుంగదువయ్య నీవు నా
కెంతయు సంకటంబు మదినేర్పడఁ జేసెదు ముద్దుభార్య తో
డాంతరమేగెనంతట హతాశుఁడనై తినిఁ గేమిచెప్పుదున్ 34

సీ॥ మోము షోడశకలాపూర్ణరాకాచంద్ర
రమ్యతాగర్వనిర్వాపకంబు
మేను హేమాసార శ్రీసహోత్ఫుల్ల గు
లాబీప్రసూనసమార్దవయుతంబు
పలుకు చూతాంకురాస్వాదమోహనకంఠ
కోకిలకాకలీ కోమలంబు
నడక హంసకులాంగనామనోజ్ఞవిలాస
యానచాతుర్యఘనాపహారము

గీ॥ అట్టి ప్రియురాలు నాకిఁక సమయునయ్య
యెన్ని జన్మంబులెత్తిన నింకనీవి
యోగభారాన బ్రదుకుచు నుండలేక
కృష్ణవేణికిఁ బ్రాణమర్పింపనుంటి. 35

ఉ॥ తక్కిన భార్యలిర్వురు యథార్థము పాపమునాటినుంటి పెం
పెక్కినకూర్మితోడ మదివేఁగ నీర్వురు నీర్ష్యలేక నా
కెక్కువ సేవఁ జేసినను నెక్కుడు నామది కద్దియేమొ నా
చక్కటి యట్టిభార్య విషయంబుఁ దలంచిన గుండెనీరగున్. 36

ఉ॥ చక్కఁగదీర్చిదిద్ది నటుసాపుగనొంపుగనున్న ముక్కు పెం
పెక్కఁగ భర్తృప్రేమ గురిపించెడు కన్గవ ముద్దులొల్కు తేఁ
జెక్కులు శ్రీఁ ఁలాటివలెఁ జెన్నువహించెడు ముద్దరాలు నా
చెక్కఁడ వెక్కునయ్యె కతమింతకు నాయఘకృత్యమేగదా! 37

ఉ॥ ఇంతవిరాగిమేను పొదినెంచుటకిద్దియె కారణంబు లో
కాంతకమామెపోపుటకుఁ గారణమేమియొ చెప్పనైతి నే
నెంతకురేనుజూడగసహీసచరిత్ర! సుఖంబులన్ని నా
కంతటితోడఁ బోయె మరి యట్టిదినంబులు నాకువచ్చునే! 38

ఉ॥ నేనొకవేగుజామునసనీరరుహాననతోడఁ గూడ బృ
స్దానదిఁ జేరి యచ్చటఁ గనంబడు నొక్కతమాలపృక్షస
న్తానపరంపరాకలితసవ్యనికుంజమునందు మన్మథా
ధీనుఁడనై రతిక్రియల దేహముమిక్కిలి సొక్కియుండఁగా

ఉ॥ ఆసరిపూరమందు ముదమారగఁ దానముచేయఁ గోర్కెలో
నూని కళత్రమేనునటఁ బోయి పరస్పరమాజలంబులన్
మేనులపైనఁ జిమ్ముకొని మిక్కిలి మక్కువ నీటియాట నెం
తేనటఁ గొన్నిచేష్టలఁ దదేకమనస్కతనొందియుండఁగా. 40

ఉ॥ ఆసమయంబునందొక మహాత్ముఁడుపాపముఁబాద గొప్ప స
న్యాసి విధానసుండెను తదాపగఁ దానముఁ జేసి యర్ఘ్య స
న్యాసముఁ జేయుచుండు సమయంబున నాసతివానినేననే
ధ్యాన సరోజమొక్కటి తదాననసీమ గిరాటువేసెనన్. 41

ఉ॥ అంతటనాతఁడయ్యు ప్రలయార్కువిధంబునజూడనొప్పు దు
ర్దాంతమహోగ్రుఁడై యటఁ దదంజలితోడనె మూర్ధురాలఁ లో
కాంతరమేగుమీపనుచు హాళపియించెఁదదుక్తికంత వి
భ్రాంతుఁడనై తదీయ పదపద్మములందబడి గద్గదిధ్వని౯. 42

ఉ॥ ఈవిధిసంటినేనపుడ హీనదయాకలితాత్మ! నాదు భా
ర్యా విసయంబసహాస్యమగునైనను మీకు క్షమింపదెల్లు మీ
రే; విమలస్వభావులిటు లింతమహాగ్రహవంతులైన దు
ర్భావులమైన మాకు శమవైఖరిసుందెడు మీకుభేదము
న్నే; పచియింపుడయ్యా! మము నీగతిజేయుటధర్మమే? ప్రభూ!

ఉ॥ పూసలలోనిదారమటు పువ్వులలోని పరీమళంబుగా
భాసురశీల! మేమదొక వైఖరినుండగ నింతలోన నా
హా! సకలార్థవేత్తవుగదా! మహనీయ! దయాత్మ! నన్ను స
న్యాసివిధంబుజేయ మరియాదయె నీకెటుపాఱజూచిన౯. 44

ఉ॥ ఆరయలోకమందు విమలాత్ములుగూడ నొకానొకప్పుడే
దోరమణీయశీల! యిటుదుందుడుకుల్చరించుచుందురి సం
సారులమైన మేమిటుల సల్పుటనైజము పూర్వకర్మ సం
చారమె వీనికెల్లను విచారణఁజేయ నిదానమెంతయు౯. 48

ఉ॥ అందునగూడ నొక్కవిషయంబు మహాశయ! నాసతీమనం
బందు భవాదృశాళి నపమానమొనర్చెదు పాడుబుద్ధి యే
సందునలేద; యిద్దిగ్రహచారవశంబున దాపురించె నే
మందును మీరుశాపమెటులైనను ద్రిప్పు యనుగ్రహింపరే! 46

ఉ॥ ఆసతిమోమునేను క్షణమైనను జూడక నిల్వఁజాల స
య్యా! సరసుండవిట్టిపలుకాడఁగఁజాడియె కత్తిమోమునన్
వేసిన నీసమైనఁ గనుపింపదు రక్తపుబొట్టు హెంతిహా
హా! సహసీయమిద్ది యటులౌసనిభావసఁజేయ నెన్నతున్. 47

ఉ॥ అత్తటి నామహోత్స్యఁపు హృదంతరమందునఁ గొంటెవార్రి తే
కొత్తగఁ శాంతకోపుఁడయి కోమలదృష్టినిఁజూచి సన్నుఁ బై
కెత్తి సమారఁ! దైవగతి నెవ్వఁడు మాన్పఁగ శక్తుఁడౌను నే
నిత్తఱినిట్టులౌననుచు నెంచితినేవిధి బ్రోవఁజాలెదో. 48

గీ॥ వచనమే బాణమరయంగ బ్రాహ్మణులకు
వచ్చె సిద్ధాస ఘామిగీర్వాణులనుచుఁ
గత్తిదెబ్బకుఁ గట్టును కట్టవచ్చుఁ
గాని దీనికి నామాత్రమైనలేదు. 49

ఉ॥ వాపున శాపవాక్యమును గ్రమ్మఱఁజేయఁగ నాకు శక్తిలే
దో? పరసేల! తప్పదిది యూరకపాపము! నీవదెంత దుః
ఖావిలభావవైస్యమున యాచనజేసిన నిష్ప్రయోజనం
బే; పలవింక పోమ్మనగ వెంటనె నాసతిరోషతప్తయై. 50

ఉ॥ ఓయి! పదుత్తి తప్పయ ప్రయోజనమేమియువేదటంచు నీ
వేయెడఁబల్కుచుంటి వటులేనిఁగనుంగొను మస్త్రదుగ్ర బా
ణాయిత శాపమంచు స్వామనంబున నేమియు చింతనేసి య
య్యా! యిటువల్కె నీతనయనై గ్రహాయించెదవెందిపీనిసిన్.

గీ॥ ఇద్ది గడచియు నేటికి నెనిమిదేడు
లింతకును వారిజాడల నెఱుఁగ లేక
దృష్టి గోచరమయ్యెడు దేశమెల్ల
దిరుగుచుంటిని బైరాగికరణి నేను 52

ఉ॥ పాపము! మీరుపోవుపని పాడయిపోవును పోయిరండు నా
కీపరితాపభారమది యెప్పుడునుండును దానికేమి మీ
రీపగిదిన్ నిశీథమునకెక్కడకేగుట నావిషాదగా
థాపరిపూర్తియయ్యెను గదా యిఁక దాచకచెప్పుడు మీపరిస్థితిన్

గీ॥ అనిన నాతడు క్షణకాలమతని మోము
నట్టె తిలకించి తిలకించి యిట్లులనియె
రూఢి మీరలు భగవత్స్వరూపులనుట
నిజము నిక్కడమీద గాన్పింపకున్నె 54

ఉ॥ ఓమహనీయశీల! భవదుక్తి ధురీణతవిన్న నామన
స్సీమకుఁగల్గె విభ్రమము శ్లేషలతోబహుయుక్తి యుక్తతన్
నీమహిమంబుఁజెప్పితివి నీవొకమాయలమారివయ్య నీ
వే మురళీధరుండ విలవేల్పువు నేనిఁక సంశయింతునే. 55

గీ॥ దొంగతనమును దండ్రిముందుగ నొనర్చె
నంటివిదియును జూడతథ్యంబుగాదె
మున్ను వసుదేవుఁడే నిన్ను ముచ్చిలించి
నందపల్లెకుఁ జేర్చదే బందినుండి. 56

గీ॥ హాస; భవదుదీరితకథాక్రమమునరయ
సీ ప్రథాపమెయందు ధ్వనించుచుంతె
అనుచు తచ్చరణాంబుజమును స్పృశింప
బోవ నాతఁడు బలవంతమున గ్రహించి. 57

ఆ॥వె॥ ఓయి ! వెఱ్ఱివాఁడ ! యూరకసీవిట్టు
భ్రాంతిఁజెందెదేల స్వాంతమందు
దొంగవాఁడసనుచుఁ దొల్లి చెప్పితినేను
నాదు మాటనెట్టు నమ్మఁగలవు. 58

ఆ॥వె॥ నిన్ను నేను జెప్పుమన్నదెద్దియు పోమె
పాడు భ్రాంతిలోనఁబడితివీవు
ఏను బ్రభుఁడనైన నీలాటిగతియేల
పట్టు వట్టిమాట భ్రాంతిపడకు. 59

ఆ॥వె॥ చదువుకొన్న పెద్ద సురసుండపీపాట
తేనియర్థమైనఁ గానఁబడును.
గాన సీకథానకంబదెద్దియొ చెప్ప
మనుచుఁ బలుక నాతఁడనియెనిట్టు. 60

ఉ॥ నందిపురాగ్రహారమను నామముగల్గిస పల్లెయుంచె నే
నందు వసించుచుండుదు నహర్నిశముస్మురళీధరాహ్వయుం
డందురు పిన్నలో మురళియందురు పెద్దలవెట్టులన్న నా
నందమెనాదు నేనొక సనాతనధర్మపరాయణుండనా. 61

గీ॥ అరయ రాధాఖ్యఁ జెలఁగెడర్ధాంగిగలదు
కనకవల్లికయను పుత్త్రిగలదునాకు
పావనభవాదృశాశీఃప్రభావకలన
నక్షరాస్యుండనైతినయ్యా! మహాత్మ! 62

ఉ॥ మాసమునుండి నేనిచట "మార్గశి" దీక్షచెలంగనొక్క స
న్న్యాసిసశిష్యుఁడై యొకదినంబున నింటికినేఁగుదెంచె శ్రీ
వ్యాసునిమాడ్కి నంత ముదమారఁగఁ బూజలొనర్చి నిర్గతా
యాసునిఁజేసి వారి కథనంతను వింటిఁ గ్రమక్రమంబుగా. 63

గీ॥ వానికిని నామమూర్తిఁ బరిణయమునుఁ
జేయఁగా నిశ్చయంబును జేసికొనఁగ
శిష్యునకుఁ గూడఁ బెండిలి సేయుమనుచుఁ
బలుకఁ దత్కన్యకార్థమై బయనమైతి. 64

చ॥ అనిన వియోగియప్పుడు మహాదరణంబు చెలంగ సంతసం
బునఁ బులకాంకురంబులుకపోలములన్ననుపట్టుచుండ; నో
యనఘ! త్వదాత్మజాఁతగన నాసమునంబునఁ గల్గుచుండె నే
ననినది నీకుఁ గోపమగునా! మరియాదలనే నెఱుంగనే 65

ఉ॥ కావున సీతసూభవను గాంచఁగ గోరికగల్గెనాకు వి
ద్యావిషయార్థవేత్తవుగదా! గృహమేధివరేణ్య! కన్యకా
భావనయున్న లోకమదివాంఛయొనర్చుట దోసమౌనె నీ
వేవిధినైన నీతనయనిప్పుడు చూపకతప్పదెంతయున్. 66

ఉ॥ శాపవశంబుచేత నిటజన్మమునందినఁగాని నాసతీ
రూపముగుర్తుపట్టుదును రూఢిగనామెకుఁ గొన్నిగుర్తులన్
జూపెద నామెగూడ ననుఁజూచిన గుర్తునుబట్టునయ్య నా
కీపరితాపభారమదియేగునుజూడఁగ నీకతలునన్. 67

సీ॥ అరయ నామెకు వామపాదాబ్జమందు
శ్రీలుగులికెడు సౌభాగ్యరేఖయొకటి
గలిగియున్నది సందేహగరిమనీకు
గలుగ నవకాశమేలనింక సన్మహాత్మ।

ఉ॥ ఈవిధనాకు నీతనయ నిప్పుడు చూపవయేనినిట్టి కృ
ష్ణా విమలప్రవాహమునఁ జచ్చుటనిక్కము దానిచేత హ
త్యావిధినీకుఁ జుట్టుకొనునయ్య యధార్థము నాప్రతిజ్ఞ క
న్యావదనంబుఁగాంచుటయొ యారయనీల్గుటయుండెనీయెడన్.

మ॥ కనుచూపందెడు మేరయందుఁ గనులం గాన్పించు సంధ్యాప్రభా
ఘనభూమీధరపంక్తులున్మధురరాకాచంద్రికలోక్కమల
స్వనరీతుల్సెలయేళ్ళ గానములు భాస్వద్వస్తువుల్నామనం
బునకుం దీవ్ర వియోగభారమది హా పుట్టించునెంతేనియున్. 70

గీ॥ ఎచటఁ గూర్చున్న నాసతిహృదయమునకు
గోచరించును మనమెంతొ గుందువంత
దాన నాకెట విశ్రాంతిలేవికతనఁ
గూరుచుంటిని నీనదీకూలమందు. 71

గీ॥ అనుచు నీరీతిగానతఁడనగ రెండు
జాములకుఁగూడఁ బైననేజరిగె రాత్రి
అంత ప్రతిమాటనేమియుననక మురళి
కట్టె మాదిరినిలుచుండెఁ గదలకుండ 72

చ॥ జలజలపాఱుకార్ష్ణవిలసల్లహరీతతి పాండురప్రభన్
కలకలలాడు చంద్రుని వికస్వరకాంతులు సోఁకి యెంతయున్.
మిలమిలలాడుచుండె మనమెంతయువేడుకజెంద నంతలో
పలనొకబాల మెల్లనిటుపాడుచు డాయఁగవచ్చె వారినిన్. 73

ఉ॥ నందకుమార ! నాహృదయనాధుఁడ నీవెయంటచు నామనం
బందుననమ్మి కేవలమహర్నిశమెన్నుచునున్నఁగాని నీ
డెందముమారకుండె నొకచేవిధినుండి తివాదినుండి నా
కెందుకు జీవధారణమిఁకేటికినేఁజని చావకుండునే.

గీ॥ తద్గృహాభ్యాగతునకునన్నదానమిచ్చి
పెండ్లి యొనరించుతండ్రిరేపేమహాత్మ ।
తండ్రిమాటకు నెదురాడఁ దలఁపలేక
కృష్ణకైనను బ్రాణమర్పింపనుంటి. 75

గీ॥ తల్లి పెను నిద్రలోనుండెఁ దండ్రిశిష్యు
నకు వివాహముఁజేయఁగన్యార్ధమేగె
వచ్చినటువంటి సాధువు పవ్వళించె
పోయె రాతిరి రెండుజాములకుఁబైన 76

గీ॥ ఇపుడు చూడ నిరోధకు లెవరులేరు
నీవు గన్పింప వేయేడఁ బోవలేక
ప్రాణహత్యకై చివఱకుఁ బాలుబడితి
నున్న సత్యస్వరూప మిట్లుండెఁ గృష్ణ! 77

కం॥ అని యీవిధముననంత
స్మరమున శ్రీకృష్ణవిభుని మరిమరి భక్తిన్
ఘనముగ నెన్నుచుఁ ద్వరతో
జనకుని దాయంగవచ్చి చకితేక్షణయై. 78

చ॥ జనకుని గుర్తుబట్టి యొక స్థాణువుమాదిరిఁ గొంతసేపు ని
స్వనమున నిల్చియుండ సుతవైఖరినంత నెఱింగి తండ్రి నె
మ్మనమునఁ జింతసేసి మరుమాటలనేమియుఁ బల్కకుండ మె
ల్లన నిటుపల్కెఁ దుస్సహ కళత్రవియోగినిఁ జూచి సభ్రముడై. 79

ఉ॥ నాకథయంతయుం గనిన నాకె విచిత్రముగోల్పుచుండె న
య్యా! కమనీయశీల! పరమాత్ముఁడొసర్చెడు చిత్రమేయెడన్
నాకెఱుంగనౌనె! సుదినంబిదిచూడగ యుష్మదీయ సు
శ్రీకర దర్శనంబున విశీర్ణముగాదె పురాఘమెంతయున్. 80

ఉ॥ ఈమయె నాతనూభవ యహీనచరిత్ర! భవత్పదద్వయీ
సీమకు దైవయోగమునజేరె నిఁకీ కథకేమిగాని మీ
రీమెను జూచుకొండు హృదయేశ్వరియైన పరిగ్రహింపు డ
య్యా! మహనీయశీల! పరమాత్ముఁడవో పురుషుండవో గదా!

చ॥ అన విని యాత(డేమి బ్రతియాడగినోపక జూచుచుండ త
జ్జనకుని భాషణంబున స సంభ్రమమై యటమీద( దిన్ముఖం
బును గనుచుండ( గృష్ణు( డతిమోహనరూపము దాల్చినట్లు నె
మ్మనమున( గానుపింపగ కుమారి పదంపడి శీఘ్రియాసయై.

ఉ॥ అంత వియోగిపాదములయందున మన్మధబాణమట్లు పెం
సంతతిమాత్మ రేకొనగ సాగి నమస్కృతి(జేసి నామనః
కాంతుడ వీవెయంచును వికస్వర తన్మధురాంకమందు ని
శ్చింతగ( గూరుచుండె నటుజేయుట దోషమొ లేకదోషమో.

గీ॥ కూతు రెట్లబోయెనోయని గుండి రాధ
యడుగు జాడనుబట్టి యీయెడకు వచ్చె
ఆ మహాశ్చర్య పరిణతి నరసియంత(
గట్టె మాదిరి కదలక నట్టె నిలచె. 84

గీ॥ ఇంతలో( దైర్ఘికుం డిదియేమటంచు
శిష్యతోగూడ నచటికి జేరవచ్చె
నచటనున్నట్టి కథనెల్ల నరసి మురళి(
గని విచిత్రపు ఫణితి నిట్లనియె నంత. 85

ఉ॥ ఓరి! పృషోక్తిభాషి! యటులూరక( జూచెదవేల నింక నౌ
రౌర! నిశీధి నొక్క విరహార్తునిమాటను నమ్మి యిట్టి వ్యా
పారము జేయ(జూచెదరె! భార్యయు నీవును ఛీ దురాత్మ! ని
న్నేరు గృహస్థుజేయుమని యేడ్చిరిరా! నను వంశపాంసనా!

ఉ॥ ఇంకనుగూడ శిష్యునక రెట్టులొ పాపము కన్యదెచ్చి మా
వంకకు వత్తువంచు తనువంతయు కన్నులుచేసిచూడ ని
శ్శంకత నర్ధరాత్ర మొకజారుని మాయలునమ్మి హా! తదీ
యాంకమునందు స్వీయతనయా మణినుంచెరవే! దురాశయా

ఉ॥ హాయిగ! నేనదే బదరికాశ్రమమందునొ! లేక దివ్యగం
గా యమునా సరస్వతులు గల్గు ప్రయాగ వటద్రుసీద నో
ద్యేయచరిత్రుఁడైన జగదీశుని ధ్యానముసేయకుండ నే
నీయెడ కేగుదెంచుటిదియే మొదలెన్నగ పెద్దతప్పు సూ. ౮౮

ఉ॥ ఆదిని తల్లి దండ్రి కళవాయెను పిమ్మట విద్యఁజెప్పు స
త్పాదులుగూడ పాడు జ్వరథాధకు లొంగి గతించినార లీ
వేదియొ యాసపెట్టి తుదకీవిధిజేసితి వింతకన్న నే
నేదెస కేగినప్పటికిసీ దురదృష్టముగాక భాగ్యమే!

ఉ॥ వచ్చితి దైవయోగమున వచ్చినతోఁవను వెళ్ళకుండ నీ
యిచ్చకముల్వినంగ మదినేలఁ గుతూహలమందితయ్య! నీ
సచ్చరితంబదంతయును చాలును బుద్ధిని దెచ్చుకొంటి నా
యచ్చపు శీలమెల్ల తుదకక్కట! చేసితె! మట్టిపాలుగా. ౯౦

గీ॥ ఎన్నగా! నీవదొకతృణచ్ఛన్నకూప
మనుచు దెలియంగలేనైతి నరరె! పాప
మెందరెందరు నామాడ్కినిట్టి కూప
మందు గూలిరొ! గోవులమంద పగిది. ౯౧

ఉ॥ ఏమది గ్రుచ్చిపెట్టినది యేవిధమారయుచుంటి వోరి! న
న్నేమయిన న్వయిబడుచు హింసనొనర్పగ గోర్కెబుట్టెనే
మో! మరియెంతమంది నిటు మోసము జేయగలేదు మున్నునీ
వీమహినెంత కేస్దగుదు విద్దిభవత్కులసంప్రదాయమా! 92

మ॥ తపమా! పాడయిపోయె పెట్టునను సిద్ధాన్నంబు లేదాయె నా
కపకారంబునుచేయఁ జూతువని యాహా! యెంచలేనైతి నే
నపహాస్యుండనుగాదె లోకమున కన్తన్నింక నేనుండ నీ
యపకీర్తిన్భరియింపఁజాలనని కృష్ణాపూర సాన్నిధ్యమున్. 93

ఉ॥ అటఁ జనుచున్నవాని కరమట్టె గ్రహించి గృహస్థుడంత హా
కటకట! యెట్టి మాటవినగా వలనెకా మహనీయ! యట్టు లో
పుటయన మీ కకృత్య మటబోవుటనాకు సమంజసంబు నే
నెటు బరికించిచూచిన నిఁకియ్యదియేగతి విద్వదుత్తమా! 94

ఉ॥ మాకుల సంప్రదాయమనుమాట భవాదృశులాడనౌనె? యే
నో కలుషాత్మకుండ భవదుక్తికి పాత్రుఁడనౌదుగాని దే
వా! కమనీయశీలురు మహాత్ములు నా కులవృద్ధులెల్ల హా
నాకతనంగదా కుల సనాతసధర్మము ధ్వంసమౌటకుకా. 95

గీ॥ కాన నే నాత్మహత్యకు గడగవలయు
గాని యద్దానికై మీరు గడగరాదు
అనుచు పైపంచ నడిభాగమున బిగించి
కృష్ణలో దూక జనువాని గేలుబట్టి. 96

గీ॥ రాధ కన్నీరుగారఁ హా నాధయనుచు
ప్రాణహత్యకు సమమైన పాపమున్నె
యిట్టులొనరింప మీమనసెట్టులొప్పె
నింతకన్నను దుష్కీర్తి యెందుగలదు. 97

కం॥ అని యీవిధమునఁ బలికిన
ఘనమతియగు భార్యమాట గాదనకంతన్
మనమున నెద్దియుఁదోచక
గనుచుండగ నాతఁడొక్క గానమును వినెన్. 98

పల్లవి:—గాన ధురీణం మురళీపాణిం భ్రమరకగోఖురరేణుం
1 హతభవలీలం మృదులకపోలం భజ; జన! కోమలశీలం
2 సకలచరాచర జగదవనాకర పదయుగళం కలితేలం
3 కాళీయాహిఫణాతట భాసురసన్మణిగణఘృణిలోలం
4 వారిదనీలం విలసత్ఫాలం కౌస్తుభరత్న విశాలం
5 కుటిల మనోజన తూలదవానల మతులమృదుల సుదుకూలం
6 గలదురులహారీతట కృతమురళీ పికునశ్రీఖేలం
7 కలయదయాలుం వరగుణజాలం సేవిత సరిదురుకూలం. 99

గీ॥ అరయ నీరీతిఁ బాడుచు నంబరమున
నుండి నారదుఁ డచ్చోట నుట్టిపడగ
మురళి తద్దర్శనామోదమునఁ జెలంగి
విధివదర్చన మొనరించి వినయమొలక. 100

ఉ॥ నారద సంయమీంద్ర! భువనంబున మీరలు సర్వవేళ సం
చారము జేయుచుందురు విచారణచేసి వచింపుడిట్టి సం
సారిగలాదె నేననినవాబ్ధిని నిల్పగనైతి నిద్దికం
సారి విలాసమా! మఱి మహాద్భుతమిద్ది మనుష్యమాయయా.

ఉ॥ ఆదిని నేను వీరికి మదాత్మజనిత్తునటంటి నంత వీ
రేదియొ గొంతసేపు నను నెంతొ పరీక్షనుచేసి పిమ్మటన్
గాదనకుండ శిష్యునకు గావలె పెండ్లియటంచుఁ జెప్పి నీ
వేదెసనైన నాక్కసుత నెట్లిటొ దెమ్మనిపల్కె నారదా? 102

గీ॥ అంతకన్యార్థమేను ప్రయాణమైన
సరణియందున నీరీతి జరిగెనయ్య
అరయ లోకత్రయమునందుఁ దిరుగుచుండు
నీవెఱుంగని విషయమున్నె! మహాత్మ! 103

గీ॥ ఇప్పుడేరీతిఁ జేయగాహృదయమునకు
దోచనందున కృష్ణలో దూకబోవ
నింతలో మీదు సంగీతమేగుదెంచె
ప్రయతభావన! నాకు కర్తవ్యమేమి? 104

గీ॥ అంత నారదుఁ డిటుబల్కె నయ్య! మురళి!
నిన్ను బోలినధన్యుఁడున్నెజగాన
మురళి పాణియె నీగృహమునకువచ్చెఁ
జూడు మావంకనని వేలుజూపనచట 105

సీ॥ శతకోటి రవిరుచి స్పర్ధాతమకుటంబు
శీర్షభాగమున సుశ్రీజెలంగ
మహనీయకానక మకరకుండలకాంతి
గండభాగమున లేయెండగాయ
గ్రీవాస్థలీలోల శ్రీవనమాలిక
పుష్పదామముల దోబూచులాడ
కటకకేయూరాదికప్రముభూషాద్యుతుల్
తత్తదంగముల దళ్కొత్తుచుండ

గీ॥ రాధికాదేవి యొకవంక ప్రణయభార
విలసదీక్షాపరంపరాకలనఁ గులుక
నాదిలో నింటికేతెంచి నట్టి ఘనుఁడె
శ్యామసుందరుఁడగుచు ప్రత్యక్షమయ్యె. 106

ఉ॥ అంతటనాయశోఽర్ధి కలయా యిదిలేక నిజంబయంచు వి
భ్రాంతినిఁజెందిలోన పిదపన్ కుదివై పునఁజూడ నచ్చట
త్యంతముదావహంబయినయాకృతి యొక్కటిగానుపించె వే
దాంతవచః ప్రసంగములకైనను జెప్పగరాని దెట్లనన్. 107

సీ॥ లలితకస్తూరికాకలిత మౌతిలకంబు
లాలాటీతటిని సౌరభ్యమొలుక
త్రిజగతీమోహ కృద్దివ్యగానగవేణు
వధరోష్ఠపుటిని సయ్యాటలాడ

సంతప్తకాంచన చారూత్తరీయంబు
స్కంధభాగములలాస్యంబొనర్ప
రమణీయకౌస్తుభరత్న శోభారాశి
చారువక్షః ప్రదేశమున మెరయ

గీ॥ కార్ష్ణులటి గానబడినట్టి కపటవిరహి
కోటిమన్మథ సౌందర్యధాటిచేతఁ
జూచువారల కంటికి శోభఁజేయ
సత్యతోగూడ నపుడుసాక్షాత్కరించె. 108

గీ॥ తన్మనోహర కృష్ణావతారయుగళ
వీక్షణామృతపాన సంప్రీతుఁడగుచు
మురళి యంజలి ఘటియించి మోకరిల్లి
భక్తిరేకొత్త నిట్లని ప్రస్తుతించె. 109

శ్లో॥ అహో!భాగ్యంభాగ్యంమయి జయతిగోలోకవసతః
ప్రభోసాక్షాత్కార స్సకల నిగమాంతైక వినుతః
ఇదానీం ధన్యోఽహం పరిణీతమిదానీం గతజను
ష్కృతం సర్వా వాంఛాఫలపదమిదానీముపగతాః. 110

శ్లో॥ జయతుజయతు రాధా సత్యభామా సమేతః
కరతలధృత వేణుః కోఽపి కృష్ణావతారః
భవతి యమవలోకాద్భక్తి మోహానుభావ
స్ఫురణ మతి నవీనంమానసేమామకీనే. 111

శ్లో॥ అపాకృతాద్భుత మహామహిమాంచిత స్త్వం
లోకేశ ! హేయగుణపుజ్జ మిమంజనం దాగ్
గాఙ్కృత్య యన్నయన గోచరతాముపైషి
సౌశీల్య మేతదితి వేల మహోత్వదీయం. 112

శ్లో॥ అతిదృఢభవబంధం త్యక్తు మిచ్ఛాపతాంవా
నిగమవిశద తత్వజ్ఞానమా కాంక్షిణాంవా
ఉభయభువన సౌఖ్యం భోక్తుమీహావతాంవా
త్వదసఘ పదయుగ్మం భూయసే శ్రేయసే స్యాత్ 113

శ్లో॥ రాధాలోల ! తమాలనీల ! భగవన్ ! సంసారవిచ్ఛేదన
వ్యాపారైకధురీణ ! తాపసమనః పంకేజ మార్ధ్వీకర !
అంభోజాక్ష ! మహానుభావ ! విలసత్కోటీరవక్షోమణీ
కేయూరాంగదనూపురాభరణ ! తేనేయం సముత్పంతతిః. 114

శ్లో॥ సత్యామానసరాజహంస ! యమునారోధ స్తమాలద్రుమ
చ్ఛాయాశ్యామల దివ్యమంగళతనో ! వందారు చింతామణే
శ్రీమన్ గోఖురధూత ధూళికలనాసంగూఢ ముగ్ధాలక
భ్రాజిష్ణో ! వనమాలికాభరణ ! తే సోఽయంప్రణామాంజలిః.

శ్లో॥ శ్రీకృష్ణాయ ! యదూద్వహాయ! మధురానాథాయ బృందాటవీ
సంచారాయ చతుర్భుజాయ తులసీదామ్నే కులస్వామినే
లీలామానుషవిగ్రహాయ మురళీ సంగీత ధౌరంధరీ
ముగ్ధీ భూతచరాచరాయ భవతేజీయాదియంమేనతిః. 116

శ్లో॥ శ్రీనాథాయ దయామయాయ జగతాంనాథాయ గోవర్ధన
క్షోణీభృద్భరవాహకాయ త్రిజగన్మిత్రాయ కంసద్విషే
గోవిందాయ జనార్దనాయ విదురప్రేమైకధామ్నే మహా
భక్తాకూరపరప్రదాయ భవతే భూయాన్మదీయానతిః 117

శ్లో॥ శ్రీమంతౌ నవపల్లవ ప్రతిభటౌ వేదాంత సీమంతినీ
సీమంతాభరణాయితౌ మణిమయ శ్రీభూషణాలంకృతౌ
సర్వానేచన కౌసుపర్ణవసనపాంత శ్రియామండితౌ
మోక్షద్వారకవాటికావిఘటనవ్యాపార కుంచాయితౌ. 118

శ్లో॥ స్వేచ్ఛాచార వివర్ధమాన విషయవ్యామోహ సంఘర్షణ
ప్రౌఢి ప్రస్మృత విజ్ఞతాముఖ గుణగ్రామం జనం మాదృశం
అభీలాంత్యదశా సముద్భవకఫశ్లేష్మాదిరోగవ్యథా
ధారాదుద్ధరతాద్రమారమణ ! తేపాదానతాభీష్టదా. 119

శ్లో॥ జీయాత్కోఽపిమనోహరాకృతిరయం శ్రీమాన్పురాణఃపుమా
సంభోజాసనపార్వతీపతిశచీనాథాదిరక్షాపరః
మత్స్యాకార ముపేయుషా; భగవతా యేనాహృత శ్రీత్రయీ
చోరస్సోమకనామకః ప్రళయవారాశౌ నిమగ్నః పురా. 120

శ్లో॥ జీయాత్సోఽయ ముదారసారకలనా ధౌరంధరీత్రాసితా
శేషోన్మత్తరిపుస్సురాసుర శిరస్సేమార్చితాం ఘ్రిద్వయః
కూర్మాకారముపేత్యమందరగిరేర్భారం వహన్ మోహినీ
స్ఫూర్జద్వేషధరో జహార రిపుతః పీయూషభాండంశనైః 121

శ్లో॥ జీయాత్తాదృగయం ప్రభాత సమయప్రోద్భూత సూర్యప్రభా
స్పర్ధాపద్యుతినై కరత్నకలనాభాస్వత్కిరీటాంచితః
వారాహాకృతిమేయుషా బలవతా యేనోద్ధృతా దుర్ధిర
ణ్యాక్షాఖ్యద్విషతా పురా వసుమతీ గోళాకృతిం ప్రాపితా. 122

శ్లో॥ జీయాన్మత్పురతస్థ్సితో యదుకులాంభోరాశిరాకాసుధా
భానుః కౌస్తుభరత్నఫాలసదురః పీతః కృపాభూషణః
ప్రహ్లాద ప్రియభక్త రక్షణ కృతేశ్రీపుంమృగేంద్రాకృతిం
లబ్ధ్వాయస్సమరే హిరణ్యకశిపుంహత్వా ప్రపేదేశ్రియం 123

శ్లో॥ జీయాత్ స్థావరజంగమాంచిత జగన్నాథః ఫణీంద్రస్ఫటా
నిద్రాళుః పరమః పుమాన్నవఘనశ్యామస్సువర్ణాంబరః
యః ప్రాగ్వామననామకోనవవటోర్వేషం గృహీత్వాబలే
స్స్వారాజ్యాపహృతించకార చరణన్యాసైస్త్రిభిశ్చిత్రదైః. 124

శ్లో॥ జీయాన్మేహృది వేణుగానరసికః కాళీయభోగిస్ఫటా
రత్నశ్రీలసమానపాదయుగళస్సోఽయం ప్రభుగ్రామణీః
యః పూర్వం జమదగ్నిమౌనితనయస్సన్ కార్తవీర్యార్జునం
హత్వా శేషధరాధరాన్ పరశునాచిచ్ఛేద యుద్ధాంగణే. 125

శ్లో॥ జీయాన్మత్పురతః కృతావతరణః గోలోకతస్సోఽముక
శ్రీకళ్యాణగుణాకరః ప్రణయనీముగ్ధేక్షణాలం కృతః
ఆసన్రాఘవనామకోహరధనుర్భంజ న్విదేహాత్మజాం
గృహ్ణన్యః కలయాంబభూవ సమరేలంకాధిపంరావణం

శ్లో॥ జీయాద్గోపవధూపయోధర తటీసంలిప్త కస్తూరికా
ముద్రాముద్రిత వత్సలోల తులసీమాలావళీ భూషితః
యః ప్రాగానకదుందుభేస్తనుభవోభూత్వా యశోదాగృహే
కించిత్కాలమువాస్యకంసనిధనం కృత్వాసమాపప్రథాం. 127

శ్లో॥ జీయాద్గోకుల రక్షకః కమలయాసంశ్లిష్టవక్షా యశో
ధామా కోఽపియువా మదక్షిపుర త స్సాక్షాత్క్రియా మేయివాన్
సోఽయం యస్త్రిపురాసుర ప్రణయినీ సౌశీల్య మత్యుజ్జ్వలం
బౌద్ధస్సన్ కృతవాన్ కుబోధవిషయైరాస్తిక్య ఘూస్యైర్హృతం.

శ్లో॥ జీయాచ్ఛ్రీసనకాది మౌనివినుతిప్రీతః కళింగాత్మజా
మజ్జద్గోపవధూదుకూల హరణవ్యాపార బద్ధాశయః
సోఽయం యస్య పవిత్ర పాదకమల ధ్యానాద్భవాంభోనిధిం
తీర్త్వా దివ్యపదం భజంతి పునరావృత్త్యా విశూన్యంజనాః. 129

శ్లో॥ విమోహతృణవహ్నయో వ్యసనతూల ఝంఝానిలా
స్థిరప్రమదహేతవ స్స్మరణయజ్ఞయూపప్రభాః
నమద్ద్విజభూరుహోభవ భయాద్రి వజ్రప్రభా
రసౌఘపరివర్షిణో విమలనామ శబ్దాస్తవ. 130

శ్లో॥ సుశీతల సుధాస్రవత్ప్రకటకోణసంభూషితైః
కుతాపనికరఘ్న ! సంమృధయ మాదృగజ్ఞాన్ జనాన్
ప్రభూత కరుణారసస్నపిత జంతుజాలైశ్చల
స్మనోజ్ఞ మృదుతారకైర్జననతారకై రీక్షణైః 131

శ్లో॥ కరచరణ సరోజస్ఫార నేత్రారవింద జాతో
మృదులమరకతాంగస్ఫూర్తిభిశ్శైవలాభః
అతులమధుర కారుణ్యోద పూరోభవాన్నో
మృతమహిత తటాకస్తాపభాజాంహి నూనం. 132

శ్లో॥ యత్కాంక్షిత స్తృణ మివతరాం దివ్యభోగా స్త్యజంతో
కాయక్లేశం బహువిధతపోజాయమానం సహంతః
కామక్రోధ ప్రముఖ విరసం వృక్షషండం దహంతో
ద్యాపీక్షంతేనలసమపిత త్త్వ త్త్రిధావేమునీశాః. 133

శ్లో॥ ముక్తాస్థూలావిరతనయనానందబిందూఘ ధారై
రంతర్ముద్రాద్రవళిత కలుషైశ్శాస్త్రిరిద్ధ ప్రభావైః
యోషాంకీన స్తుతిరవ సమాకృష్ట కందర్పదర్పై
ర్విజ్ఞానీశై ర్నిబిడభవనే దేహావాసంప్రపేదే : మే. 134

ఉ॥ ఆవిధి స్తోత్రమున్సలిపి యంతటనాతఁడు కన్నువిప్ప రా
ధావనమాలికాధరులు తత్క్షణముద్గమనానురీతి బృం
దావనమేగె పిమ్మట యధార్థపు రూపముతోడ సత్ప్రభా
మా వరు లిద్దరాత్మపురమందునఁ జేరిరి తేపసంబునన్. 135

గీ॥ ఆమహాశ్చర్య పరిణతి నరసియుక్తై
పరవశత నున్నయట్టి దంపతులఁజూచి
నారదుఁడు దివ్యగాన విశారదుండు
యటను జరిగిన కధనంత నిటువచించె. 136

ఉ॥ భో ! మహనీయ ! నీకడకు ముందుగ నిన్నుఁ దరింపజేయు సు
శ్రీమధురేష్ట భక్తజన సేవ్య మనోహరరూపదీప్ర రా
ధా మురళీధరద్వయమె తైర్థిక శిష్యులమాడ్కి వచ్చె నీ
వీమహినెంత ధన్యుఁడ వింకేటికి నీ కల మోక్షమేసుమీ. 137

ఉ॥ ఆరయ పూర్వమందు భవదాత్మజ తత్సతి సత్యభామ కం
సారి విలాసమిద్ధి యొక శాపముచే నిటు నీకు పుత్రికా
కారముదాల్చె తత్వమిదిగావున చిత్రమునొందెదేల ? నీ
వో ! రమణీయశీల ! యిటపూర్వము శాపమునందితౌ సుమీ.

గీ॥ కాసవనమాలి దుఃఖి రూపాననీకు
గానబడి జెప్పినటువంటి గాధనెల్ల
మరల నొకసారి నీమనస్సరణియందు
పాఱఁజూడుము దెలియు నీప్రభవమెల్ల. 139

గీ॥ నీకు నిప్పుడు గాన్పించు నిర్వురొకటె
గాని నీభక్తి భావనా గరిమకతన
రాధికా కృష్ణరూపంబు శక్తిదాల్చె
నందు నొక్కఁడు గోలోకమందునుండు. 140

గీ॥ నీకు రెండవమారు గాన్పించినట్టి
మురళిధరుఁడన్న నీసుత మోహమంద
కోటిమన్మధ సౌందర్య ధాటివెలుగు
రూపమునుదాల్చి నీపురిలోన నుండె. 141

గీ॥ ప్రాగ్భవంబున నీవు శాపమును బెట్ట
సహిత శాపమునీకు గ్రమ్మరఁజెలంగె
వారలే మీరు దొందరబాటువలన
సంక్రమించె నేతాదృశ జన్మమిటు. 142

ఉ॥ ఈవిధిమీరు జన్మ మిటనెత్తగ వత్తురటంచు నెంచి బృం
దావనచారియైన హరి నందపురంబును సృష్టిజేసి స
త్వా వనమాలిరూపమును దాలిచి జెలంగుచునుండె నందు కృ
ష్ణా పరపూరమన్న యమునానదియేసుమి దివ్యభావనా 143

ఉ॥ నీవును రాధ పూర్వమున నిత్యవిభూతికిఁ జేరగోరి సం
భావనఁజేసినారు భగవంతుని యద్దిఫలించె నేడు గో
దావిమలాత్మ కిప్పుడు యథావిధి పెండ్లినొనర్పఁ బొమ్ము ప్రా
చీవర దిక్కునందు రవిచేరగవచ్చుచునుండెఁ జూడుమా. 144

ఉ॥ నీవిఁక రాధతోగలసి నిత్యవిభూతికిఁ జేరితేని కృ
ష్ణా విమలప్రవాహమును నందపురంబును రెంటిగూడ బృం
దావన మేగునయ్య యదిదగ్గరనయ్యెను వేణుపాణి న
న్నీవిధిఁజెప్పుమంచు మహనీయనియోగముచేసె నెంతయున్.

గీ॥ గాన నేఁబోవుచుంటివి క్రమభక్తి
పెంపు జెందగ దేటికి పెండ్లిజేసి
నేటి కాఱవ రోజున నాటిరాత్రి
భార్యతోగూడ ముక్తిని బడయగలవు. 146

కం॥ అని యీవిధమునఁ బలుకుచు
ఘనమతియగు నారదుండు గానముచేతన్
మనమున గృష్ణుని నెన్నుచు
చనియెను తే గాలిమహతి సన్నగమ్రోయన్. 147

ఉ॥ అంతట నాగృహస్థు ముదమారగ రాధయు వెంటనంట ని
శ్చింతగ నింటికేగి యటఁజేరినవారికి తద్విచిత్రవృ
త్తాంతముఁజెప్పి పిమ్మట యథావిధి దేవికి పెండ్లిజేసి దీ
క్షాంతమునందు మార్గళికి స్వస్తినిజెప్పి నిరీక్షసుండగా. 148

ఉ॥ ఆరవనాటిరాత్రి పరమాత్ముఁడు కృష్ణుఁడు కోటిమన్మథా
కారముదాల్చి స్వప్నమున గన్పడి నీవిఁక రాధతోడ నీ
సారె స్వయంప్రభోరు విరజాతట దీప్రవికుంఠ లోకమున్
జేరుమటంచు జెప్ప నటఁజేరెను తత్క్షణ మాతడెంతయున్. 149

గీ॥ స్వప్నమున మొన్ననాకు సాక్షాత్కరించి
స్వీయగాథను నాచేతఁ జెప్పుకొనిన
పరమపదముననున్న యామురళీ ధరుఁడె
సుమ్ము శ్రీ నిత్యసూరిగఁ జూడనొప్పె. 150

గీ॥ వారిమంగళా శాస్త్రప్రభావకతన
రచన చేసితి నీలాటి రమ్యకథను
గానఁ బెద్దల నేరీతినైన పూజ
సలుపుచేసుమ్ము సకలార్థ సాధకంబు. 151

గీ॥ వారుచూడగ నెటువంటివారలైన
వారిమంచినె గ్రహియింపవలయుగాదె
మొగలిచెట్టుకు పాములు మూగియున్న
దానిపువ్వునె గ్రహియింప దలచినట్టు. 151

ఉ॥ పాపము! నన్నెదెప్పు దెడబాయక నూతనమైన దివ్యమే
ధాపురు శక్తినిచ్చిన సుధాకరమూర్తి హయాననుండు గా
ధా పరిపూర్తిసల్పెను వృథాయగునే దనునమ్ముకొన్న నే
నాపరమాత్మునమ్మితిని నాతఁడు నమ్మెను నన్నెదెంతయుఁ.

ఉ॥ నమ్ముడు నమ్మకుండుఁడరి నాహృదయానికి వేద్యమౌను లో
కమ్మిఁక నెట్టులన్న తురగాస్యుఁడు నాయెడనుండెనంచు నే
నమ్మితి నట్టి ప్రత్యయమె నన్ను కృతార్థునిగాగఁజేనె శ్రే
మమ్ము యశంబు సౌఖ్యమును మాన్యత సిద్ధిలు నాకునానిచేఁ.

ఉ॥ ఔన; సతంబు నేమతురగానన దైవతమంత్రరాజ సం
ధానముచేత నూతన కథారచనంబున నూనుకొందు గా
వీ నవనీత తుల్యకమనీయ కవిత్వమునెంచిచూడ మే
ధావిధులైన మీరలెగదా దగువారు రసజ్ఞులౌటచేఁ. 155

గీ॥ కనుక మహనీయులార! నాకవనమందు
దప్పులున్న క్షమింపఁ బ్రార్థనమొనర్తు
పరుషఁదెప్పుడు నిజపదసార్థకుండు
కుమతి యెట్లన్న నాకేమిఁ గొఱఁతలేదు. 156

ఉ॥ ఈకధ విన్నవారల కహీనసుఖంబులు సంభవించు సు
శ్రీకుఁడు వేణుపాణి గృహసీమ వసించును వ్రాయువారి కీ
హాకరుఁడై చెలంగు ముదమారఁగ నెప్డు పఠించువారి క
య్యో! కఫవాతపిత్తరు జలంటవు దీనినిఁ జెప్పువారికిన్. 157

గీ॥ కలఁడు కణ్వ వశిష్టాత్రిగాధితనయ
వామదేవాది ముని పరంపరలయందు
జేరి మిక్కిలి ప్రఖ్యాతిఁజెందినట్టి
భవ్య విజ్ఞానియొక భరద్వాజమౌని. 158

ఉ॥ ఆమహనీయ దివ్య విమలాన్వయమందుఁ జెలంగుచుండె శ్రీ
ధామమనంగఁ జెల్లుబడిదాల్చిన శ్రీ గుదిమెళ్ళ సంజ్ఞ వి
ద్యామృదులైనవారలకు దావలమౌ నొకశాఖ తత్ప్రతి
ష్ఠామ సృణత్వమీదృశ వచస్కులఁ గందదు చెప్పఁజూచినన్.

గీ॥ ఆమహాన్వయమందున నవతరింతు
రధికవిద్యులు బహుశాంతులైనవారు
కౌస్తుభామృత విధుకల్ప కములమాడ్కి
గలుగు దుర్జనుఁడెటో హాలాహలముపగిది. 160

గీ॥ మలిన సంపర్కమునగాని మంచివస్తు
వరయ నొకవిధమగు కాంతినందరేదు
ప్రకృతి భాస్వరమగు సువర్ణంబుగూడ
నికషమునఁగాని కాంతులనీనబోదు. 161

కం॥ ఆర్యుఁడు సీతారామా
చార్యుఁడు గుదిమెళ్ళ వంశజలధిని రంగా
చార్య కుమారుఁడుగా బుధ
చర్యా ధుర్యుండు బుట్టె చంద్రుఁడు మాడ్కిన్. 162

గీ॥ అతని సహధర్మపత్ని సీతాభిధాన
సద్గుణనిధాన విష్ణుపూజావధాన
వారిసుతులందు రెండవవాడ నేను
పేరు రామానుజుండని బిలుచుచుంద్రు. 163

గీ॥ శ్రావ్యమగు సంస్కృతాంధ్ర భాషాకవిత్వ
మబ్బె తురగాస్యమంత్ర మాహాత్మ్యకలన
ప్రాయ మిరువదినాల్గు సంవత్సరములు
వ్రాసితిని మురళీధర విలాసకృతిని. 164

మ॥ అరయన్ తామరతంపరట్లు భపదీయ శ్రీలపంశంబు శ్రీ
మురళీపాణి కృపావిశేష విలసన్మార్గావలోక ప్రథా
స్ఫురణన్ వృద్ధినిఁ జెందుగాక; ధర నీపూర్వోత్త పుణ్యంబులీ
పిరుసన్బండెను కోటిరెడ్డి మృదుభావా మత్కృతీశప్రథన్. 165

ఓం

శాంతి శ్శాంతి శ్శాంతిః సర్వేజనాస్సుఖినోభవంతు
సర్వం శ్రీ హయగ్రీవార్పణమస్తు.
సమాప్తము.

